# రాధికాసాంత్వనము

ముద్దుపళని ప్రణీతము.



ప్రకాశకులు,

శ్రీ సత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్.

రాజమండ్రి.

చందితులైన మెంబర్లకు మాత్రమే.

వెల ఒక రూపాయి.

# రాధికా సాంత్వనము.

ముద్దుపళని ప్రణీతము.



ప్రకాశకులు

శ్రీ సత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్,

రాజమండ్రి.

పండితులైన మెంబర్లకు మాత్రమే.

వెల ఒక రూపాయి.

శ్రీరస్తు.

(ఇళాదేవీయ మనునామాంతరముగల)

# రాధికాసాంత్వనము.

## —♦ ప్రథమాశ్వాసము ♦—

శ్రీలఁ జెలంగురాధికను
జెల్వరొ నిన్నిల రూపురేఖలన్
బోలుదు రేవఁడంతు లన
మోహపుటాలిని నివ్వ డెన్నఁడో
హాళిని నిన్నుఁ గూర్చి యని
యల్గినయాచ్చెలిఁ గౌఁగలించు గో
పాలునిఁ జిన్నికృష్ణునిఁ గృ
పాళునిఁ గొల్తు నభీష్టసిద్ధికై.

సీ. రహిఁ ముద్దుటడుగులు ♦ రాజీవములఁ గేరఁ
ప్రపదముల్ తాఁబేటి ♦ వగలఁ బోఁగ
సరసోరుకాండముల్ ♦ సౌకర్య మేపార
లేఁగౌను సింగంపు ♦ లీలఁ జీరఁ
జనువళుల్ త్రిక్రమి ♦ సౌజన్యమునఁ దేఱ
భుజములారామతా ♦ స్ఫూర్తిమీఱ
రమణీయముఖకాంతి ♦ రామచంద్రునిఁ జేరఁ
జిరునవ్వు బలుతెల్వి ♦ గరిమఁ గోరఁ

తే. గీ. గన్నుఁగవ శ్రుతిలంఘి యై ♦ కలిమి గులుకఁ
దనరుమధురాధరము కల్కి ♦ తనముచిల్కఁ

జెలగుశుకవాణి రుక్మిణీ ♦ జలజపాణి
భావభవుమాత సంపద ♦లీవుఁ గాత. 2

చ. నెఱిగమనంబు వేణియును ♦ నిక్కుచముంగవ మీఁదిపాదముల్
కరులును శేషభోగియును ♦ గంబులు నాఁటముకూర్మరాజమై
వఱలఁగ బొల్చుగంధవతి ♦ భామ మనోహరరూపసత్త్వతన్
నరకుని గాంచి పెంచుగతి ♦ నన్గృప నెప్పుడుఁ బ్రోచుఁ గావుతన్ 3

ఆ. వె. శ్రీనివాసుఁ డైన ♦ శేషుని భజియించి
ఘనశరీరుఁ డైన ♦ గరుడుఁ బొగడి
యఘవిదారి యైన ♦ హరిచమూపతి నెంచి
పరమసూరిజనులఁ ♦ బ్రస్తుతింతు. 4

మ. క్షితి వాల్మీకిపరాశరప్రియసుత ♦ శ్రీకాళిదాసాదులం
గృతవిద్వత్కవితాఢ్యులం బొగడి భ ♦ క్తిన్ నన్నయార్యుం దు న
న్నతి యెఱ్ఱాప్రెగడ సోమభాస్కరులు శ్రీ ♦ నాథుంబు ధీమంతులా
గృతు లౌ నాంధ్రకవీంద్రులం దలఁతు యే ♦ ర్తిన్ మత్కృతిసాధకిన్. 5

తే. గీ. పాత్రమున నుందుశల్యంబు ♦ లెత్తివేసి
శాస్త్రయుక్తిని గొని తేప ♦ ... సేయు
గ దగునాక్షేపజీవక ♦ కవుల దిట్ట
జనదు కృతులె నమంగళ ♦ జనులు వారు. 5

చ. చెలువుగ బూర్వసత్కవులు ♦ చేసినకబ్బము ... దడిగా
జెలిమిని నీకృతిన్ గణన ♦ సేతురె సత్కవు లందు కేమొకో
భళి కయికొందు రెట్లనిన ♦ బద్మముఁ దేనియ వానతుమ్మెదల్
పులిసి హసించకే యిత్తఱి ♦ పుష్పమరందము లోలి గ్రోలవే. 6

వ. అని యిష్టదేవతా నమస్కారంబును, గపిసత్కారంబును, కుకవితిరస్కారంబునుం గావించి యొక్కమేనియు నొక్కకృత్యంగాఁ బ్రబంధంబు నిబంధింపఁ దలంచి హరివాసరంబున శ్రీహరిం బ్రార్థించి మన్నిశాంతంబున నిదురింపుచున్న నన్నిశాంతంబున.

సీ. కటిఁ జుట్టి కట్టిన ♦ కనకాంబరముతోడ
మెఱుఁగుచామని చాయ ♦ మేనితోడ
నాసికతుదఁ గలు ♦ నవమౌక్తికముతోడ
జిగిలికస్తురిబొట్టు ♦ మొగముతోడ
గమనాశముఁ జిక్కు ♦ కన్నుఁదమ్ములతోడఁ

నెమ్మిగెకేతురాయి ◆ నీటుతోడ
గుడిగొని వెన్నాడు ◆ కుసుమపుంజముతోడ
జంద్రసూర్యాదిభూ ◆ షాళితోడ
తే. గీ. ప్రబలి యెఱుంగని దివ్యరూ ◆ పంబుతోడ
సొగసు గనుపించు మవ్వంపు ◆ సొంపుతోడ
రాధకామణికై దండ ◆ గమనఁ బూని
చిన్నికృష్ణుండు కలను బ్ర ◆ సన్నుఁ డయ్యె. 9

తే. గీ. ఇట్లు గనుపట్టునతని ◆ నేనెలమిఁ గాంచి
లేచి సాష్టాంగవందనం ◆ బాచరింప
శౌరి నను జూచి మోముగం ◆ భీరవము
దనరఁ గాఁ బల్కెఁ గరుణామృ ◆ తంబు లొల్క. 10

తే. గీ. చిన్నికృష్ణుండ నే వాఁడ ◆ చిత్తమునకు
సమ్మతంబైన రాధికా ◆ సాంత్వనంబు
తగ నొనర్పు మదీయాంకి ◆ తముగ నీవు
లలితగుణశాలి శ్రీముద్దు ◆ పళని బోటి. 11

వ. అని యానతిచ్చి యంతర్హితుండగుటయుఁ నేను నిదుర మేల్కాంచి యీశుభస్వప్నంబెవ్వరితో దన్నవించెదనని యూహించి యుభయవేదాంత ప్రతిష్ఠాపనాచార్యుండును నిరుపమౌదార్యగాంభీర్య ధుర్యుండును బాపసమందగికీర్తింప మహోన్నుండలుండును బాలితభక్తమండలంబును. తిరుమల తాతాచార్యవర్య కులకలశపారావారతారానాయకుండును మరియుపూర్వజన్మతపఃఫలసారుండును, సుగుణాభిరాముఁడునునగు నిగర్వాఘువశేశిక స్వామిని సన్నిధానంబునకరిగి సాష్టాంగదండప్రణామంబు లాచరించి తత్కటాక్షంబునుం గాంచి యీశుభస్వప్నంబు విన్నవించినఁ దత్సన్నిధానంబునంగల సకలశాస్త్రవల్లభులగువిద్వజ్జనంబులును న్నవలోకించి సాక్షాచ్ఛ్రీమన్నారాయణావతారుం డగుశ్రీరాఘవదేవుచరణారవిందంబు లాశ్రయించినదాన వగుటంజేసి దేవదేవుం డగు శ్రీకృష్ణదేవుండు సాక్షాత్కరించె నీవ నీకు నధికశ్రేయఃప్రాప్తి యగు నని యనుంగాక. 12

సీ. ఏరాజు కువలయం ◆ బెల్ల రంజిలఁ జేసి
దైవాత్మకాఖ్య ని ◆ చ్చలుఁ దలిర్చు
నేలోకబాంధవుం ◆ డిలఁ దమంబు లడంచి
చక్రిప్రమోదంబు ◆ సంఘటించు

నేఘనుఁడు శరంబు ♦ లేవేళఁ గుఱియించి
పరవాహినుల నెల్ల ♦ భంగపఱచు
నేయాతుఁ డాగ్యాప ♦ నాయత్తమతిఁ గాంచి
కీర్తింప సర్వజ్ఞ ♦ మూర్తి యౌను
తే. గీ. వాఁడు నృపమాత్రుఁడే రఘూ ♦ ద్వహదయాప్ర
వాహవర్ధితభోసలా ♦ న్వయపయోధి
సోమతోళజేంద్రవరతనూ ♦ జుండు శ్రీప్ర
తాపసింహక్షమాపాల ♦ తల్లజుండు. 13

సీ. తనయౌదార్యమతమహో ♦ దార్యవిస్ఫురణంబు
శేఖరుఁ బండ్లిగి ♦ లింపఁ జేయఁ
దనరామభక్తిప్ర ♦ ధానమానసశుద్ధి
నారదు వెలవెల ♦ బాఱుఁ జేయఁ
దనసర్వవిద్యావ ♦ ధానమేధాస్ఫూర్తి
పన్నగేంద్రునితలల్ ♦ వంపఁ జేయఁ
దనయశౌర్యగభీర ♦ తానారతఖ్యాతి
యంబోధి భంగపా ♦ టందఁ జేయ
తే. గీ. నమర శీతాద్రిసేతుమ ♦ ధ్యావనీత
లాంతర నిరంతరయశోవి ♦ లాసభాస
మానభోసలతోళజరా ♦ ణ్మణిసుతప్ర
తాపసింహేంద్రమౌళి ప్రతాపహేళి. 14

తే. గీ. ఆమహారాజకృపఁ జెంది ♦ నట్టినీకు
నిట్టిభాగ్యంబు లద్భుతం ♦ బేమి తెల్ప
సార మగునీదువిస్తార ♦ చర్యలెల్ల
వినుము వినుపింతు మని యిట్టు ♦ లనిరి కరుణ. 15

సీ. శ్రీరమణీపద ♦ శిఖరాగ్రముల నేవి
చిగురుజొంపంబులై ♦ జిగి చెలంగు
స్మరరిపుబ్రహ్మాది ♦ మకుటంబులం దేవి
పద్మరాగంబులై ♦ ప్రభ లొసంగు
మౌనిరాణ్మానస ♦ మానసంబుల నేవి
కమలవనంబులై ♦ ఘన మెసంగుఁ

జిరతరశ్రుతివధూ ♦ సీమంతముల నేవి
యరిదికుంకుమపట్టు ♦ లై వెలుంగు

తే. గీ. నట్టిసర్వజ్ఞ మౌళిశృం ♦ గాగ్రనటన
పటుతరక్రమత్రిజగతీ ♦ పావనస్రు
తీతవారితప్రసురధునీ ♦ తిలకజన్మ
పదము లనుపమశ్రీవిష్ణు ♦ పదము లమరు. 16

తే. గీ. ఆమహీనాథుపదపద్మ ♦ మందుఁ బుట్టి
నురుచిరఖ్యాతిఁ గనె నీతి ♦ నూడ్రజాతి
దాన నయ్యావయ మెలంగె ♦ దానకర్ణుఁ
డితఁడె యంచని జను లెల్లఁ జతురుఁడగుచు. 17

తే. గీ. ఆతఁ డెంతయు గాంచెఁ జెం ♦ గాటివలన
నతుల యగుముద్దుతంజనా ♦ యకిని ప్రేమ
నాడి బొంకనివాని ము ♦ త్యాలుఘనుని
తంజనాయకి వారలఁ ♦ దత్తు గొనిరి. 18

కం. అల తంజనాయకీమణి
కలిమియుఁ జెలిమియు గణింపఁ ♦ గాఁ దర మగునే
తెలివో గెలివో వలపుల
చెలువన్ గెలువన్ దలంచుఁ ♦ జెలువము చేతన్. 19

సీ. వీణ వాయించెనా ♦ వివిధచిత్రాద్భుత
ప్రతిమ లెల్లను తలల్ ♦ పరఁగ నూచుఁ
కీవి నటించెనా ♦ దేవలోకపురంధ్ర
కొంచక యాదల ♦ వంచుకొనుచు
గానంబు వినిపింపఁ ♦ బూనెనా యామహా
గిరిరాజ మైనను ♦ గరగిపోవు
సభల మాటాడెనా ♦ చల్లగా బన్నీరు
చిలికినట్లనను ♦ జెలువు మీర

తే. గీ. నని దొరాదొర లెన్నగా ♦ ఘనత కెక్కి
పోర్డచేడెలలో నీడు ♦ జోడు లేక
తతగుణశ్రేటి దివ్యసౌం ♦ దర్యవాటి
యతను మదఘాటి తంజనా ♦ యకివధూటి. 20

సామాన్య జీవనం ♦ బెసఁగ తటాకంబు
ఘటియించె సేతుమా ♦ ర్గంబునందు
తే. గీ. మేటి యెవ్వతె గండర ♦ కోటలోన
మఱియు నిత్యాన్నదానాది ♦ మహిమలంది
పార్వతీశులనిత్యోత్స ♦ వములొనర్చె
నట్టిరామామణివధూటి ♦ నలవె పొగడ. 25

సీ. ముదమొప్పఁ దనగోము ♦ మోము గావించినవాఁడె
తేజ మొందిన ద్విజ ♦ రాజు గాఁగ
బ్రతి లేనితనకటి ♦ ప్రతిమ జెందినవాఁడె
తెఱఁ గొందుభూతలా ♦ ధిపుఁడు గాఁగ
గోము రొప్పఁ దనగబ్బి ♦ గుబ్బ లంటినవాఁడె
నిరుపమ దుర్గాధి ♦ నేత గాఁగ
నలువు మీఱినతన ♦ నాభి చేకొనువాఁడె
వైభవోన్నత చక్రి ♦ వర్తి గాఁగ
తే. గీ. తెలఁగుకలిమియుఁ గెలిమియుఁ ♦ దెలివి గలిగి
కళయుఁ జెలువమౌ తళుకును ♦ బెళుకు నళుకు
చెలువు గులికెడువలపుల ♦ సొలపు మిగుల
మిగులు రామావధూటి యన్ ♦ సుగుణపేటి. 26

సీ. నారదుండలవిష్ణు ♦ వామకీర్తనభక్తి
నీరదుండౌదార్య ♦ సారయుక్తి
రాముఁ డద్భుతదయా ♦ రసనిరంతరబుద్ధి
సోముఁ డంచితకళా ♦ సుప్రసిద్ధి
రారాజు భీముని ♦ క్రమనికారస్ఫూర్తి
భోజరాజు కళాప్ర ♦ భూతకీర్తి
జిష్ణుఁడు వైభవ ♦ శ్రీవిలాసఖ్యాతిఁ
గృష్ణుఁ డుభరతకళా ♦ స్త్రీయజాతి
తే. గీ. వనఁగ నను వొందు బ్రహ్మవి ♦ ద్యాప్రవీణ
సరసతిరుమలతాతయా ♦ చార్యపాద
తోయరుహమత్త చంచరీ ♦ కాయతాత్మ
పాలితాశ్రితజనుఁడు మ ♦ త్యాలుఘనుఁడు. 27

తే. గీ. అట్టిముత్యాలఘనుఁడు తాఁ ♦ జెట్టఁ బట్టెఁ
దనకు ననుకూల యగుసతి ♦ ధర్మపత్ని
యౌానటంచును మానితా ♦ నూననుగుణ
పేటి మేటివధూటి శ్రీ ♦ పోటిబోటి. 28

సీ. శ్రీలక్షణమున ల ♦ క్ష్మిని సాటి యన వచ్చు
జంచల యై ధాత్రి ♦ మించదేని
వైభవంబున శచీ ♦ వనిత నీ డన వచ్చు
బలుగాకిపుత్రులఁ ♦ బడయదేని
భూతిపెంపున శైల ♦ పుత్రి జో డన వచ్చు
విభుమేను సగము గా ♦ వింపదేని
నిశ్చలత్వమధారు ♦ ణిని సరి యన వచ్చుఁ
బతులను లెక్కఁడఁ ♦ బడయదేని

తే. గీ. యనఁగ ననుపమసకలగు ♦ ణాభిరామ
యగుచు బాంధవజనకోటి ♦ యభినుతింప
సొంపుమీఱఁగఁ బెం పెక్కు ♦ సంపదాఢ్య
పోరిగృహవాటి శ్రీపోటి ♦ యన్యవధూటి. 29

సీ. సాహిత్యవిద్యావి ♦ శారద శారద
యై ముద్దువళని నా ♦ నమరునిన్ను
గురుతరంబై తగు ♦ గుణగణప్రౌఢిచే
లాయుతుం డైనవే ♦ లాయుధాఖ్యు
భరతభావాభావ ♦ భావజగురుఁడు నాఁ
గొమరుఁ గాంచెను ముద్దు ♦ కొమరువరుని
రూపవిభ్రమకళా ♦ రూఢి నెంతయు రతీ
దేవి యనా ముద్దుల ♦ క్ష్మివధూటి

తే. గీ. బుద్ధి నల్లారు ముద్దయిన ♦ ముద్దుయాఢ్య
దీటు లేనట్టిపద్మావ ♦ తీలలామఁ
జెలిమిమీఱు రామస్వామి ♦ చెలిమి గాంచె
మేటిముత్యాలు పోటిన ♦ ఘాటివలన. 30

కం. వెలసితివి వారిలోన
నెలచుక్కలలోన వెల గు ♦ నెలరేక యనఁ

లలితకళావిభవంబులు
వలనొప్పఁగ మేటిముద్దు ♦ పళనివధూటీ. 31

సీ. ఏనాటి నీరీతి ♦ నెంతో భక్తి చెలంగ
ప్రాయించె జయధాటి ♦ రామకోటి
ఏనారి నీదారి ♦ నెలమివిద్వచ్ఛ్రేణిఁ
దనియించె నెర మెచ్చి ♦ ధనములిచ్చి
ఏకల్కి నీపోల్కి ♦ నిలగీర్తి గైకొనెఁ
గబ్బముల్ చేసంది ♦ ఘనత జెంది
ఏబాల నీలీల ♦ నిటు దొరాదొరలచే
బొగడొందె గడిజేటి ♦ పొలుపుమీరి

తే. గీ. తలఁప నేధీర నీమేరఁ ♦ దాతయార్య
పాదముల వ్రాలె మదినెంచి ♦ ప్రస్తుతించి
కలరె నీసాటి ముత్యాలు ♦ కన్నమేటి
ప్రబలగుణపేటి శ్రీముద్దు ♦ పళనిబోటి. 32

సీ. చెన్నొందుదరంభ గా ♦ కున్నచోను బ్రితాప
సింహేంద్రునిపెంపును ♦ జెంద నేల
ప్రతి లేనియలకల్ప ♦ లతిక గాకున్నచో
లలి ముద్దులక్ష్మితో ♦ బుట్టనేల
తగుదివ్యసుగుణర ♦ త్నంబు కాకున్నచో
ముత్యాలలోనుండి ♦ పొదల నేల
యిల సుగంధప్రద ♦ మిదియె కాకున్నచో
శ్రీనివాసప్రాప్తిఁ ♦ జెలఁగ నేల

తే. గీ. వీకగలఁ చంద్రరేఖయె ♦ కాకయున్న
లలితసకల కళాప్రౌఢి ♦ వెలయ నేల
యని పొగడ మేటియై మీఱె ♦ వతనుఘోటి
భవ్యవాగ్ధాటి శ్రీముద్దు ♦ పళనిబోటి. 33

ఉ. పున్నమచందమామ కెనఁ ♦ బోలుముఖంబు ముఖానురూపవా
తిన్నని వల్కు పల్కులను ♦ దేరిన సద్దయ సద్దయారసో
త్పన్నపుజూపు చూపున ధ్రు ♦ వంబగునీవియు సొమ్ములౌచు మే
న న్నలు వొంద నొప్పు నర ♦ నాధులు మెచ్చఁగ ముద్దులక్ష్మియున్.

కం. పద్మారి గేరుమోమును
బత్మాస్త్రుఁడు గోరుగోము ♦ బలునాల్ గన్నుల్
పద్మాళి దూఱు కన దగి
పద్మావతికీతి దనరు ♦ బద్మావతియున్ 35

సీ. ఘటియింప నేర్తువు ♦ కవనజాతు లెఱింగి
పలుకులకల్కి వె ♦ ల్వైలనఁ బార
నీయఁగా నేరుతు ♦ విలగోరిన వరాలు
నగరాజు సుకుమారి ♦ సగముగాఁగ
చెల్లింప నేర్తువు ♦ చెప్పినకీతి గాఁ
గని ద్రౌపదీ సతి ♦ కానకేగ
నటియింప నేర్తువు ♦ నవరసంబులవంటె
తగురంభ యనిమిష ♦ త్వము వహింప

తే. గీ. నీదె మతి యుక్తి పరికింప ♦ నీదె శక్తి
నీదె నెరపద్దు నరయగా ♦ నీదె ముద్దు
సరసముగాఁ జేసి రాధికా ♦ సాంత్వనమ్ము
భక్తి హరి కిమ్ము శ్రీముద్దు ♦ పళనిబోటి. 36

వ. అని నియోగించిన నేనును బ్రబంధనిబంధనోద్యుక్తుఁడనై. 37

—♦ షష్ఠ్యంతరములు ♦—

కం. శ్రీకృష్ణదేవునకు గరు
ణాకరచారిత్రవిలస ♦ దనుభావునకున్
గోకులజ ప్రియభావున
కాకృతిజితశంబరార్య ♦ హంభావునకున్. 38

కం. కౌస్తుభయుతవిస్తృతవ
క్షస్తలునకు భక్తలోక ♦ సంరక్షకుతా
నిస్తులునకు శ్రుతిమస్తక
వాస్తునకు సమస్త విబుధ ♦ వరవస్తునకున్. 39

కం. శౌరికి జనవాంఛితసహా
కారికిఁ బాండవకులోప ♦ కారికి వచలో
ద్ధారికిఁ గలికలుషాఘవి
దారికి దనుజేంద్రమదమ ♦ తంగజహారికిన్. 40

కం. అర్జునమదనాభ్యాసున
కర్జునకరకాంతిమంద ♦ హాసున కతిభ
కార్జునకృతసహావాసున
కర్జునవాసునకు ద్వార ♦ కావాసునకున్. 41

కం. కరుణావర్ధిష్ణునకున్
బరమమునిప్రకరహృదయ ♦ వర్తిష్ణునకున్
గురుకులగిరిజిష్ణునకున్
జిరగుణయుతవిష్ణునకును ♦ శ్రీకృష్ణునకున్. 42

వ. అంకితంబుగా నాయొనర్పం బూనినరాధికాసాంత్వనం బను శృంగార ప్రబంధంబునకు గథాక్రమం బెట్టి దనిన. 43

కం. శ్రీవనితావరశుభ్రయ
శోవారిధిపూర్ణచంద్రు ♦ శుకయోగీంద్రున్
భావించి చూచి జనక
క్ష్మావరుఁ డిట్లనియె భక్తి ♦ సంభ్రమపరుఁడై. 44

సీ. మునినాథ 'మును నేను ♦ బోఁదుగా హరికథ
ల్వీనులవిందుగా ♦ వింటి నందు
నందుతోఁబుట్టు గో ♦ విందుని కత్తె యై
వరగుణాకర యన ♦ వఱలు రాధ
తా నెత్తి పెంచఁగాఁ ♦ దగునిళాసతిమీఁద
వడి నేల బలుకారు ♦ బారుచేసి
గోపాలదేవుపైఁ ♦ గోపించె నపు డెట్లు
దక్షిణనాయకా ♦ ధ్యక్షుఁ డైన

తే. గీ. దేవకీసూనుఁ డానారి ♦ దీరు దీఱఁ
దీరుగా నేలె నవి యింపు ♦ దేఱునటుల
నాన తీవయ్య బహుసావ ♦ ధానమతిని
విని కృతార్థుఁడ నయ్యెద ♦ విమలహృదయ. 45

కం. అన విని శుకయోగీంద్రుఁడు
వనజాక్షుని దివ్యపాద ♦ వనరుహయుగళిన్
దనివారఁ దలఁచి యిట్లనెఁ
గనులం దానందబాష్ప ♦ కణములు దొలఁకన్. 46

సీ. ఏవంకఁ జూచిన ♦ కేణీవిలోచనా
రతికూజితార్భటీ ♦ రావచయము
ఏచాయ జూచిన ♦ నిందుబింబాననా
వల్లకీవాదన ♦ వైభవంబు
ఏతావు చూచిన ♦ నిభరాజగామినీ
సంగీతసాహితీ ♦ సంభ్రమంబు
ఏదిక్కు చూచిన ♦ నింద్రనీలాలకా
భరతశాస్త్రోక్త భా ♦ వాభినయన
తే. గీ. ఎందు జూచిన గోపికా ♦ బృందగీత
మదనగోపాల సత్కథా ♦ మహిమ లలర
సంగభవమల్లరంగ మై ♦ రంగుమీఱు
బహుతరస్త్రీలతోడ వ్రే ♦ పల్లెవాడ. 47
తే. గీ. అందుఁ జెన్నొందు నందుని ♦ మందిరమున
వాస మైయుండు కౌస్తుభో ♦ ద్భాసితుండు
దానవవిదారి యిష్టహృ ♦ త్తాపహారి
భవ్యగుణపాళి మదనగో ♦ పాలమౌళి. 48
సీ. కువలయామోదంబు ♦ గొనవచ్చుసత్కీర్తి
నిశికాంతుఁ డగుట సం ♦ దియము గలదె
కమలాభిరుచిహేతు ♦ కంబైనతేజంబు
దినవాథుఁ డగుట సం ♦ దియము గలదె
దానవారిసమృద్ధి ♦ దవరించునస్త్రంబు
దేవేంద్రుఁ డగుట సం ♦ దియము గలదె
హంసాహితశ్రీల ♦ నలరారు నెమ్మేను
నీలాబ్ద మగుట సం ♦ దియము గలదె.
తే. గీ. యువకరదళోపలాలన ♦ గనుపదంబు
లంబుజాతంబు లన సందే ♦ యంబు గలదె
యని తనుగుఱించి బుధజను ♦ లభినుతింప
శీవిఁ దళుకొత్తు శ్రీకృష్ణ ♦ దేవుఁ డనఁగ. 49
సీ. సవరంపు పరువంపు ♦ సవరంపురుచి నింపు
నెఱసొంపు గలజంపు ♦ కురులతోడ

నలువొందు నెలలందుఁ ♦ గళలెందు దగఁజిందు
తొగవిందు జిగిఁజెందు ♦ మొగముతోడ
నునుదమ్ములను దిమ్ము ♦ లను నిమ్ములనయమ్ము
గనునొమ్ము సిరిఁగ్రమ్ము ♦ కనులతోడ
నొగిఁ బ్రబ్బుబిగిరబ్బు ♦ నగుమబ్బు బిగి నబ్బు
లనుద్రొబ్బుగనలబ్బు ♦ తనువుతోడఁ

తే. గీ. దనర బ్రేపల్లెలోఁ గల ♦ తలిరుఁబోఁడ్లు
హరికపటచర్యలకు మోహి ♦ తాత్మ లైరి
యొప్పుదనుఁ జేరి మెప్పించు ♦ చొప్పుఁ జూచి
మరులు పూనరె సతు లైన ♦ మాను లైన. 50

సీ. గురుకుచకుంభము ♦ లుద్ధరము ల్గాకున్న
గోపాలకరఘాతిఁ ♦ గొనఁగనేల
కలికివాల్గన్నులు ♦ కలువలు గాకున్న
హరిచూపుకాంతిచే ♦ నలర నేల
తుల మించు మైదీఁగె ♦ యలమించు గాకున్నఁ
గృష్ణాంబుధరముతో ♦ నెనయ నేల
శ్రీపాదపద్మము ♦ ల్చిగురులు గాకున్న
మాధవుచేఁ జెల్వ ♦ మంద నేల

తే. గీ. యనుచు బుధకోటి పొగడఁగాఁ ♦ దవరుకోటి
యన్నువులమిన్న నందుని ♦ కన్నఁజిన్న
వారిధరవేణి రాధికా ♦ కీరవాణి
ప్రబలుటను జెలంగ హరిప్రాణ ♦ పద మనంగ. 51

వ. అదియునుం గాక.

సీ. నెరిగొప్పు మినుకొప్పు ♦ నిడుదపెన్నెరులతో
నునుజూపు లీనెడు ♦ కనులతోడఁ
గళలు దేఱుచు మీఱు ♦ కళికె నెమ్మోముతో
విడికెంపు గనుపింపు ♦ పెదవితోడ
గొఱగట్టుకొని పుట్టు ♦ నెఱపూపచనులతోఁ
గడుసన్నగిలుచున్న ♦ కౌనుతోడ
జిగి హెచ్చుచును వచ్చు ♦ చికిలిలేఁదొడలతో
జడతలొల్కుచుఁ గుల్కు ♦ నడలతోడ

తే. గీ. రమణఁ బాల్గాఱుచెక్కుట ♦ ద్దములతోడ
మేల్మి గనుపట్టు చిన్నారి ♦ మేనితోడఁ
దేజరిల్లును బేరిశా ♦ దేవి యనఁగ
రాజగోపాలు పట్టంపు ♦ రాణి యగుచు. 53

ఆ. వె. ఆమెఁ గూడి దాన ♦ వారికిఁ గాలుఁడు
గోపపతుల కెల్లఁ ♦ గుసుమశరుఁడు
జలజజాదిసురల ♦ కలపరబ్రహ్మంబు
తల్లిదండ్రులకును ♦ దనయుఁ డగుచు. 54

సీ. మోహించి యొకక్రేవ ♦ ముగ్ధభామామణు
లత్తుకుఁజూవులఁ గల్వ ♦ దండ లొసఁగ
మన్నించి యొకచోట ♦ మధ్యాణుమధ్యలు
దెలినవ్వులన్సునమాం ♦ జలులు సెరప
భావించి యొకప్రక్కఁ ♦ బ్రౌఢచంద్రానన
ల్ఘనకుచలికుచము ♦ ల్గాన్క లీయ
లాలించి యొకయిక్క ♦ లోలలోలాక్షులు
లలి మానధనములు ♦ లంచ మంప

తే. గీ. నందఱకు నన్నివగల నా ♦ నంద మిచ్చి
చల్ల సేయఁగ నింటింటఁ ♦ జద్రుఁడగుచు
మందలో నుండు దున్మథ ♦ మన్మథుండు
ప్రాభవస్ఫూర్తి రాజగో ♦ పాలమూర్తి. 55

తే. గీ. విదళ దాదు లడుగులకు ♦ మడుఁగు లొత్తఁ
గనుయశోదయు గారాబ ♦ మునసుజూడ
గరిమ నందుఁడు గన్నులఁ ♦ గప్పుకొనఁగ
రాధ పోషింపఁదగు నిశా ♦ రాజవదన. 56

సీ. శౌరిని గని రాధ ♦ చనుగుత్తు లివిగో కొ
మ్మన లేవే తన కింత ♦ యను నిశయును
మారవైరి గని రాధ ♦ మోవివండిదుగో కొ
మ్మన లేదె తన కింత ♦ యను నిశయును
వరుని గన్గొని రాధ ♦ సెరిపింఛమిదుగో కొ
మ్మన లేదె తన కింత ♦ యను సిశయును

బద్మాక్షు గని రాధ ♦ పలుకెంపులివిగో కొ
మ్మన లేవె తన కింత ♦ యను నిశ్చయమున

తే. గీ. హారిని గని రాధ యలయాట ♦ లాడుదాము
పదుక టింటికి రమ్మని ♦ తోడరి పిల్వ
వాడ నేఁగూడ వచ్చెద ♦ నను నిశ్చయమును
నవ్వి రాధికా మాధవుల్ ♦ రవ్వసేయ. 57

సీ. మురువుగా దాఁగిలి ♦ మూఁత లాడెడువేళ
యదు రాయలకు బల్మ్రి ♦ రెదురుపడును
రీతిగా గుజగుజ ♦ రేకులాడెడువేళ
మదన గోపాలుని ♦ గదిసి నిలుచు
గొమరుగా వెన్నెల ♦ కుప్పలాడెడువేళ
మారవైరిచే గను ♦ ల్మ్రూయనిచ్చు
గుములుగా గుజ్జెన ♦ గూడు లాడెడువేళ
గంసవిద్వేషి చెం ♦ గట వసించు

తే. గీ. నెట్టులైనను దేవకీ ♦ పట్టికరము
గరము తను సోకగా దని ♦ కరముచేత
సుదతియలవాడె సైఁగఁగాఁ ♦ జూచు బ్రోడ
లమ్మ చెల్ల యిదెంతచి ♦ త్రాంగి యనగ. 58

సీ. పాడించు నొకవేళ ♦ బహుదేశ్యరాగము
ల్నాలించునొకవేళ ♦ జంత్రవాద్య
మెఱిఁగించు నొకవేళ ♦ భరతశాస్త్రప్రౌఢి
బట్టించు నొకవేళ ♦ భావరసము
నెగడించు నొకవేళ ♦ నెరికావ్యసంగతు
ల్గనుపించు నొకవేళ ♦ బూవిల్తుశాస్త్రంబు
బోధించు నొకవేళఁ ♦ గవనరీతి
జదివించు నొకవేళ ♦ శయ్య లోలి

తే. గీ. నూఱి పోయు మఱొకవేళ ♦ నారజంబు
వచ్చె ననిపించు నొకవేళ ♦ వాద్యవిధము
నెపుడు చూతునో యిద శౌరి ♦ నెవయ ననుచు
దయ నపుడు పొంగి యిళకు రా ♦ ధాలతాంగి. 59

కం. నలు గలఁదు జనక మార్చును
జలువలు గట్టించు షద్ర ♦ సాన్నము లుంచున్
దెలనాకుమడుపు లిచ్చును
గిలికీ ర మ్మనుచుఁ దీసి ♦ కౌ గిటఁ జేర్చున్. 60

సీ. ఒమ్మ గా దిమ్మ లై ♦ రొమ్మ రావలె నంచుఁ
కులదేవతల నెల్లఁ ♦ గోరి కొలుచు
నిడుద లై మెఱుఁగెక్కి ♦ నెరికురుల్ పెరుఁగంగఁ
దిన మొక తైలంబు ♦ దెచ్చి యంటుఁ
గిలిగిక న్నారికంబు ♦ దొలఁగ జెంచుల కెంతొ
యిచ్చి తీసినమందు ♦ లిచ్చి నిచ్చ
నెవ్వ డీడేమనో ♦ ముద్దరా లని
యుపవాస మొక వేళ ♦ నుండనియదు

తే. గీ. వగలు లై సేసి చెలి యుండు ♦ సొగసు జూచి
దృష్టి పై దృష్టి తీసుక ♦ తెఱవ వాదు
సవతి వౌదువె యని చెక్కుఁ ♦ జఱచి మోము
మోమునఁ గదించి నూఱాఱు ♦ ముద్దు లిడును. 61

కం. సతి నిట్టు రాధికామణి
సతతము గనుగంగనీక ♦ చనువున మనిచెన్
రతిమగనితోఁటలోపల
లతకూనను పెంచినటుల ♦ లలితము గాఁగన్. 62

తే. గీ. కొమ్మ కటు యౌవ్వనవసంత ♦ గుణ మొసంగఁ
నొలుతఁ గనుపట్టుబాల్యజా ♦ తులు దొలంగెఁ
గ[illegible]ప్రసులు తొవ రెక్కఁ గడమతావు
[illegible]అప్పు మీ కెను గోకిల ♦ స్వరము [illegible]దవె. 63

సీ. అక్షరఓంబంబున ♦ కరుదెంచు చిలుకల
పలుకులో యున ముద్దు ♦ పలుకు లమరె
ముఖచంద్రమండలం ♦ బును గ్రహింపఁగ వచ్చు
పెనురాహువో యన ♦ వేణి యమరె
నలు పొందునాభిపు ♦ న్నాగంబునకు బాఱు
నళులబా రనఁగ నూఁ ♦ గారు దనరెఁ

బదపద్మయుగళంబు ♦ గదిసి పోకున్న రా
యంచ యంచన మంద ♦ యాన మెసఁగ

తే. గీ. మీరుబహునవశ్రీల్బొంది ♦ నాదు గనుక
విన్నవించెద నని తళ్కు ♦ బెళ్కు లమరఁ
జేరనో తెల్ప నసఁ గను ♦ ల్బెవులఁజేర
రమణి కటు చాలయౌవనా ♦ రంభవేళ. 64

తే. గీ. గుబ్బగుబ్బలులను ద్రొబ్బి ♦ నిబ్బరముగ
గుబ్బెతకు గబ్బిసిబ్బెంపు ♦ గుబ్బ లుబ్బె
సరసయౌవనమానస ♦ సరసిలోనఁ
బోడముబంగరునునుదమ్మి ♦ మొగ్గ లనఁగ. 65

తే. గీ. అరయఁ దనజోడుబయలాయె ♦ ననెడువంత
చిత్తముననాటనానాఁటఁ జిక్కెఁగాను
మానవానికి నైతుకే ♦ మహిని దలఁప
బట్ట గట్టినబలుగుణ ♦ వంతు లెల్ల. 66

సీ. వెన్నునిముఖచంద్ర ♦ బింబంబు కళదేఱఁ
దరుణిలోచనకుము ♦ దంబు లలరె
శౌరికిఁ జికురాంధ ♦ కారము ల్పెరుఁగంగ
ముకురాస్య నఖరతా ♦ రకలు వెలసె
వనజాక్షువక్షఃక ♦ వాటంబు జిగి మీఱ
బిబ్బోకవతిచను ♦ గుబ్బ లుబ్బె
స్వామికిఁ భుజకల్ప ♦ శాఖలు బళియంగ
నతనాభికని బాహు ♦ లతిక లెనసె

గీ. హరికి యౌవనవాసంతె ♦ మతిశయిల్ల
నాతికిని బికకలకంఠ ♦ నాద మొదవె
ఫళిర యిటువంట యీసరి ♦ పతులజాతి
రీతు లమ్మయ్య యని రతి ♦ ప్రియుఁడు వొగడ. 67

ఆ. చికిలిసానఁ దీర్చు ♦ జీవరత్నముకీలిఁ
బరువ మైనకుసుమ ♦ వల్లిపగిది
మెఱుగు చేసినట్టి ♦ మేల్మిబొమ్మవిధాన
రమణి దనరె జవ్వ ♦ నమున నపుడు. 68

తే. గీ. శుభదినంబున సత్రము ♦ శుద్ధి గలిగి
నెలఁగువేళను గురుమాపు ♦ చీరతోడ
సరసరుచిరాన్నభోజనా ♦ త్తరమునందు
నీ వెలుంగనిచేడియ ♦ యీడుమీఁజే. 6

సీ. మనయశోదను జేరి ♦ మనయిళ్ళ పుష్పించె
నని చెప్పి బహుమతు ♦ లందరమ్మ
తెలియఁగా రోహిణీ దేవిని రప్పించి
యాచిన్నెలో కావొ ♦ యరయరమ్మ
చుట్టుప్రక్కాలకు ♦ శుభపత్రికలు వ్రాసి
పంపు మామకు శ్రుత ♦ పఱచరమ్మ
దినశుద్ధి లగ్నంబు ♦ గని సాంగ్యములు దెల్ప
వేగ గర్గుని బిలి ♦ పించరమ్మ

తే. గీ. కళికిలతకూన పుష్పిణి ♦ గాఁ జెలంగె
నెవరు గన్నారు మాధవు ♦ నెనసె నేమొ
మందు లీవలె సాంబ్రాణి ♦ మధురమధువు
మంచిఖర్జూరములను దె ♦ ప్పించరమ్మ 70

కం. అనివనితల గుసగుసలను
విని కనులను జలము లొలుకఁ ♦ బెనుసిగ్గుపడన్
వనజాక్షిని గని రాధిక
చినిచిన్నెలకన్నె నెన్ని ♦ చేసెదరనుచున్. 71

సీ. అంటుగల్గినవారి ♦ నంటుకో నియమించి
పడతిని మగరాల ♦ పలకనుంచి
విప్రసువాసినీ ♦ వితతిచేఁ బాడించి
వనమేనఁ గుంకుమ ♦ నలుగులుంచి
చలువగొజ్జగునీట ♦ జలకంబు లాడించి
తడియొత్తి కురులార్చి ♦ జడ ఘటించి
వసమించు కెంబట్టు ♦ పావడ బిగియించి
రంగుచంగావికో ♦ కను గదించి

తే. గీ. రవికె దొటగించి సొమ్ము ల ♦ లంకరించి
జాజు లెనయించి కల్పముల్ ♦ సంఘటించి

యరుగుపై నుంచి పాలు పం ♦ డ్లవరించి
క్రోల నిప్పించి చిమ్మిలి ♦ గొట్ట బంచి 72

తే. గీ. భేరి మొదలగు వాద్యము ♦ లొప్పుకొనగ
వరుస నెనయించి చెలిక్రోడి ♦ బ్రాలుగట్టి
కుంకుమరసంబు కస్తూరి ♦ కుసుమములును
బంధుమిత్రాప్త తతికిచ్చి ♦ పంచి రాధ. 73

తే. గీ. చాన నిట్లరపడకింటి ♦ లోని కనిచి
మొల్లపూఁబాన్పుపై నత్తె ♦ మిల్లనుంచి
దగ్గరను నింబదళము వేత్రంబు నునిచి
యొగ్మ్రలుల నందు జాగరం ♦ బుండఁ బనిచి 74

తే గీ. మాంత్రికుల బిల్చి యిలుచుట్టు ♦ మంత్రయంత్ర
తంత్రములఁగూర్చి నద్దెసల్ ♦ తప్పిదారి
భూతములఁ జెందుఁ బోగనీక ♦ ఘాలి జల్లిఁ
కిటికిఁ గాపాడె గనురెప్ప ♦ గాచినటుల. 75

తే గీ. వేడ్కఁ గావించె మరునాఁడు ♦ పిట్టుకొట్టి
కలశమున నెత్తి సీమసీ ♦ మలపుఁ దనియఁ
బంచి పంచమ దినమునఁ ♦ బసపునూనె
యంటతికి బోసి జలకని సెం ♦ డ్లరుగునుంచి. 76

తే. గీ తరుణులప్పుడు సంపెంగ ♦ తైలమంటి
మించు బోఁడిని దాన మా ♦ డించి కెలమి
దమ్మిదుమ్మితివోర చేతి ♦ తకిరుటాను
చికిలిబాకును దేజమూల్ ♦ చేసినటుల 77

సీ. పరిమళంబులు మొట్టి ♦ కురులార్చె నొకభామ
చక్కఁగా జడవేసె ♦ నొక్కలేమ
కస్తూరి తిలకంబు ♦ ఘటియించె నొకజంత
బుక్కాము మైజల్లె ♦ నొక్కకాంత
కెంబట్టుపావడ గీలించె ♦ నొకబోటి
యొకైక ముడివెట్టె ♦ నొక్కబోటి
హారంగోక మొలగట్టె ♦ నొకమదావళయాన
యొదవించె మణిభూష ♦ లొక్కచాన

తే. గీ. తరుణి యొక్కతె ♦ నిల్వుటద్దంబుఁ జూపె
రమణియొక్కతె మేన గం ♦ ధములఁ దీఁడె
బడఁతి యొక్కతె యరుగు ధూ ♦ పంబు వైచె
జేడియకు నిట్లు రాధ కై ♦ సేయువేళ. 78

తే. గీ. తెఱవ యారీతి నిండు ము ♦ స్తీబుతోడ
నల్లసిల్లెను మల్లెపూఁ ♦ జల్లు లలర
నవ్వఁగల చివ్వలకుఁ గాను ♦ ద్రవ్వుకొనుచు
మరునిపడి వాగ్గైపై గోవ ♦ మట్టుమనఁగ. 79

కం. అంతటఁ గాంత లిళాసతి
వింతగ గైసేసి తెచ్చి ♦ వెల గలమగరా
సంతసల మంతు కెక్కిన
దంతపుపనిచవికెలోన ♦ దయపని వారున్. 80

తే. గీ. మేల్మిపచ్చల గద్దియ ♦ మీఁద నుంచి
చేరి యానసూయయు మొదలగు ♦ పేరఁటాండ్రు
మన యిళామాధవులకు శో ♦ భనమటంచు
జల్లగా బాడి సుంకులు ♦ చల్లిరప్పుడు. ౮1

సీ. చెక్కుటద్దములపైఁ ♦ జెమటబిందువులూర
కస్తూరి తిలకంబు ♦ కరఁగి జాఱ
కర కంకణంబులు ♦ ఘల్లుఘల్లున మ్రోయ
నలువంక జూపు వే ♦ న్నెలలు గాయ
స్తనభార మోర్వక ♦ తనుమధ్య మసియాడ
నిండు మోహంబుతో ♦ నీవి వీడ
కబ్బసిబ్బెపుబ్బు ♦ గుబ్బచన్నవ పొంగ
బాహుమూలోజ్జ్వల ♦ ప్రభ లెసంగ

తే. గీ. కటితటంబునఁ గీల్జడ ♦ నజన మాడ
గగనమున కేగుఁబ్లూర్పు ♦ గాడ్పుతోడ
దాళగతులొప్ప సంసంగ ♦ శైలమంటె
దమక మదనాటి హరికి రాధా వధూటి. 82

తే గీ. చెలులచే యూనుకొని లేచి ♦ కలికి యొడిన
పాదుకలు మెట్టి రాజన ♦ ప్రౌఢి సేగి

మేటిమగరాలముక్కాలి ♦ పీటమీఁద
శౌరి కూర్చుండె మజ్జన ♦ సదనమునను. 83

కం. లికుచకుచ శౌరి కత్తరి
లికుచరసం బిడియె నఖర ♦ రేఖలచే నొ
క్కొక్కటిగఁ జిక్కుడలింపుచుఁ
బ్రకటితఘననీలకేశ ♦ పాశంబందున్.

కం. కుంకుమ నలుఁగిడె నొకచెలి
పంకజదళ నేత్రుమేన ♦ భావములోనన్.
డెంకగునను రాగరసం
బింకఁగ వెళిదీసి విభున ♦ కిప్పించెననన్. 85

కం. గంధామలకము పెట్టెను
గంధేభసమానయాన ♦ గనుకనిఁ గరమున్.
గంధతను లంటె యయ్యెఁగ
గంధవతీధవున కపుడు ♦ గరిమ పటిర్వన్. 86

తే. గీ. పసిడిగిండులచే ముంచి ♦ పడఁతులయ్యె
జలకమార్చెను జెలువగొ ♦ జ్జంగినీట
రమణునకురాధ మదన సా ♦ మ్రాజ్యమునకు
జెలగి పట్టాభిషేకంబుఁ ♦ జేసెననగ. 87

సీ. కురులార్చె నొకలేమ ♦ సురటి నొక్కతెవీవ
పరిమళాగురులధూ ♦ పములనొసఁగి
సిగవైచె నొకభామ ♦ నిగరాలతాయెతు
లీలించి జంటరు ♦ మాలుగట్టి
విరులుంచె నొమరామ ♦ విడళించి వన్నెట
బదనిచ్చె గోవజ ♦ వ్వాజి జమిరి
పట మిచ్చె నొకచాన ♦ యటువిప్పి నలుగంగ
నీక తావులుగట్టి ♦ నెగయిబట్టి

తే. గీ. తిలకవతియోర్తు కస్తూరి ♦ తిలక మునిచె
గంధగజయాన యొక్కతె ♦ గంధ మలఁదె
దడవుగా నొర్తురత్నాల ♦ తొడవులిడియె
శౌరికినిజాల నయ్యాలం ♦ కారవేళ. 88

కం. ఎనిమిదిదిక్కుల రాజుల
ఘనకీర్తులు వచ్చి యతని ♦ గవిసె ననంగా
నునుముత్తెపు క్రొక్కట్టులు
వినుతాంగి యుడంగ శౌరి ♦ వీనుల మెఱసెన్. 89

తే. గీ. కళలు పదియారు నేగంటి ♦ మనుని మోము
గనియె నరువదినాలుగు ♦ కళలటంచు
గలిగి కఘులారి హరిపదా ♦ క్రాంతుడయ్యె
ననఁగ మగరాల పెండియం ♦ బునిచె నొక తె. 90

కం. మకర యుత హారయుగంబునఁ
దగియెన్ జిగిచిలుక తాళి ♦ ధర నాతనిబల్
సొగసు గని చిత్తజన్ముండు
దెగి పాఱఁగఁ బట్టు వడిన ♦ తేజి యనంగన్. 91

కం. మగరాలపతక మొక చెలి
దగిలింపఁగ శౌరియెదను దగె నాలోనన్
వగ నీనుకొగలరాయఁడు
సొగ సగతల్పలఁ దొంగి ♦ చూచె ననంగన్. 92

తే. గీ. కూర్మి నిఁక నిట్టి శ్రీదేవి ♦ గోరు లుంచు
ల నెడువగ గోళ్ళుకుతికంటు ♦ మునిచె నొక తె
యంఁదులపు రాప కెంపుల ♦ నందగించు
నిట్టు లనఁ గౌస్తుభము శౌరి ♦ కిడియె నొక తె. 93

తే. గీ. రమణి గీలించుతారహా ♦ రము మురారి
యురమున వెలింగె నెడలోన ♦ మెఱయుచున్న
తనవరుని బంపి మఱి యిళా ♦ తరుణి నెనరు
మనుచుఁ దారక లటువలెఁ ♦ గొనె ననంగ, 94

తే. గీ. చాన గీలించునీలకం ♦ జాతసరము
మెఱసెఁ జిన్నికృష్ణునివిద్యు ♦ టురమునందు
మారు లేగితన్మోహనా ♦ కారమునకుఁ
జంచలాక్షులు దృష్టి తాం ♦ కించి రనఁగ. 95

తే. గీ. పడఁతి గట్టినకాంచనాం ♦ బరము దనరె
నంబుజాక్షునిస్వచ్ఛదే ♦ హంబుమీఁద

వతనియొద నిండి తగువాడ ♦ యారసంబు
పైని దాని ట్టులను గాన ♦ వచ్చెననఁగ. 96

కం. తోఁగముగనిబావ నిట్టుల
వగగాఁ గై సేసి తెచ్చి ♦ పనిహార్యులహో
న్మగరాలచవికెంగోవల
కరాగచ్చుల పీట నునిచి ♦ తరుణులు వేడ్కన్. 97

తే. గీ. చని యిళాదేవిఁలగ్న ♦ సమయమాయె
రమ్మమాయమ్మ యనిక్రమ్మి ♦ కొమ్మలెల్ల
బలిమిగొని పిల్వ రాఁక ♦ భయము చేత
దగ్గ దిగ్గున లేచి నుకా ♦ సిగ్గుమాని. 98

సీ. పలపులచంద్రకావిజిగి ♦ పొంవడరంగు లెసంగఁ గైకొని
నాబిలి చీరపుచ్చెళులు ♦ చిందులు ద్రొక్కఁగ జంటిపైకలో
పరిచనుగుబ్బ లుబ్బఁగను ♦ బంగరు టందెలు ఘల్లుఘల్లనన్
జలజదళాక్షి వచ్చె రబ ♦ సంబున నయ్యెదురాజు నొద్దకున్. 99

తే. గీ. అపుడు సుముహూర్త మనుచు గ ♦ ర్గాదిమునులు
శోధనము జేసి రానిత్య ♦ శోభనులకు
వాద్యములు మ్రోయ నిఖిల ది ♦ క్పతులు పొగడ
నాప్తబంధు సుహృత్కోటి ♦ తృప్తిబొంద. 100

కం. అన్వేశను హరియు నిళా
యశాన్వితరత్నంబు బొందె ♦ నావలితోడన్
బువ్వము దిని రాజుతులకు
నువ్విళ్లూరుచును మెప్పు ♦ నొసగుచు నంతన్. 101

కం. నందుం డందర బగమా
నందంబును నొందఁ జేసె ♦ నయ్యైమరియా
దం దగుసూనృతభాషా
సందోహము చేఁ బటాని ♦ సత్కారములన్. 102

తే. గీ. అంతసంతోషసం బరి ♦ తాంతరంగు
డగుచు దాంబూల ఫలదాన ♦ మాచరించి
యతిపయోను దాను క్షీరాన్న ♦ మారగించి
యువతి యిసురత్నపాముకా ♦ యూగలి తొడిగి. 103

తే. గంధవడిలోనమమ్మాడి ♦ మందగతుల
వచ్చి నేఁతావి కమలచా ♦ ల్పాల గొనంగఁ
జిన్ని మరుపంతి నినొ్నక ♦ సన్నుఁ జూడ
సరస నెక్కుడు మీదిపై ♦ సరము లేగ. 111

సీ. కనుగోటిమీటుల ♦ కేకుచగిరులట్లు
పొంగి తాళవు దీని ♦ మొగ్గ సన్ను
పెపంటిగంటుల ♦ కీమోవిపగడంబు
వగను దాదు దీని ♦ చిగురుఁ బెదవి
కామారుసాదన ♦ కీయూరుకాండంబు
లటుల తాళవు దీని ♦ యనటి తొడలు
ఈకాఁగిలింతల ♦ కీతనుకనకంటు
వలెను దాళదు దీని ♦ మొలక మేను

తే. గీ. నీకు నం యగుసటు లెల్ల ♦ నేను గాను
బాల మెఱుంగని పడి పట్టి ♦ ముగ్ధ గాని
తెలిసి యోటు లేలెదో నీకుఁ ♦ దెలుప వలెని
దేవ దక్షిణనాయకా ♦ ధవుఁడ వీవు. 112

సీ. కొనవాల్కఁ గొని మోవి ♦ చెనకిచూతువు గాని
యుదరంటఁగా నొక్క ♦ యానఁబోకు
ముద్దుచెక్కులఁ జిన్ని ♦ ముద్దు లుంతువు గాని
జిగిగోటికత్తుల ♦ జీరఁబోకు
మొనవేళ్ళఁ జను మొనల్ ♦ పుడుకు దంతియ కాని
వగవగ బిగిపట్టు ♦ పట్టఁబోకు
రతికేళి మెల్ల మె ♦ ల్లన సల్పుదువు గాని
దురుసుపై రసములు ♦ నెరపఁ బోకు

తే. గీ. వెఱ్ఱినై తెల్పవను గాని ♦ వెలఁది నీవు
వలపులను మించి గడిజేరి ♦ వద్దఁ జేరి
మారుసాములఁ జలపోరి ♦ పోరువేళ
నాదుగురికట్లు నిలుమినా ♦ నలినవయన 113

తే. గీ. అంచు వాక్చేతి కిచ్చనొ ♦ ప్పగించిరాఁగ
వత్తుఁ నే గూడ నని చెలి ♦ పైటఁ బట్ట

వేగ వచ్చెద ననివిడి ♦ పించుకొనుచుఁ
జనియెమదిఁ ఖేదమోదముల్ ♦ పెనగొనంగ. 114

వ. ఇట్టిమ్మందయాన యమందయానంబునఁ బసుకయిలు వెల్వడి రత్నముద్రికాలంకృతం బైనకంగేల నొక్కబాలికామణిం జెయ్యూతగొని యన్యాసుదేవు వెడ బాసి పోవం జాలనిచిత్తంబుతోన తనకనుడియమ్మృత కాశినలం గని తలు పోర సేయుండ ను నెపమున తిరిగి తిరిగిచూచుచు రాజసౌధవలంబించి యెవరితోడం బలుకక డగ్గుత్రియ నడంపుచు గేళిపూగుత్తు లాఘ్రాణించుపోలికఁ నిట్టూర్పులు నిగుడింపుచు కెందొగల విందుఁ గనుచంద్రంబున పదనారవిందం బెత్తి కందోయుం గ్రందుకొనుబాష్పబిందుబృందంబులఁ జిప్పిలనీక రెప్పల నార్చుచు హరిపిరవ ఖరం బునం దాఁకి జారినకరకంకణంబులంగని చేయెత్తి కప్పుకొప్పుదిద్దుకొనుచొప్పునఁ గప్పుచుఁ గుచలికుచంబులం గదగడమని తగులు కొనుచిగురువిలుగలతులువపెగలఁ దగిలి చిటిలి పెటిలి పడుతారహారంబుల బయలుపడనీయక పయ్యెద చెరంగున మరుంగు సేయుచు నిజమందిరంబుఁ బ్రవేశించి యందొక్కచో కాటంపుమలుపుపట్టుపేలుకట్టులం గనుపట్టుకట్టాణిముత్తియంపుజల్లులతో నల్లిబిల్లి గావల్లుకొనుబొందుమల్లియలపూదండలం దగిలి రొదలుచేయు తుమ్మెదలగరుల నిగనిగలకుం బసులనఁగఁ దగలి మగరాలసోరనగండ్లనుండి వెలికి నిగుడునగురు సాంబ్రాణిపొగలమగుడం దోయుచు దొరగంటిమచ్చుకంటులనెరినెరుల వరలువిరులచేరుల నెత్తావుల నత్తమిల్లి మత్తిల్లి వమ్ముకమ్మతెమ్మెరలవగ మిగులుమగరాలసౌధంబున నెంతయు వింతవింతవని సంతనలమంతు కెక్కుజీవదంతపుఁ జప్పరకోళ్ళమంచంబుపై గవిణింబంబు దంటు విడంబించు కెంబట్టుపరుపున రాజీవశిఖాశిల సెకమీలుసూరెపుటంబు తలగడఁ జేరియొక్కపల్లవపాణి పదపద్మంబులుపట్టుచుండఁ బవ్వళించి యాత్మగతంబున

ఆ. వె. సొమ్ములియ్య వచ్చు ♦ సొమ్మందమియ వచ్చు
నియ్యరాని ప్రాణ ♦ మియ్యవచ్చుఁ
దనదువిభుని వేరు ♦ తరుణిచేతికి నిచ్చి
తాళ వశమె యెట్టి ♦ దానికైన.

సీ. వాలి యింతకు మున్నె ♦ నాసామిమధురాధ
రామృతమ్మను జూఱ ♦ లాడ కున్నె
యతివ యింతకు మున్నె ♦ హరివిప్పటురముపై
గుబ్బలకసి దీఱఁ ♦ గ్రుమ్మ కున్నె
రమణి యింతకు మున్నె ♦ రమణుగౌఁగిటఁ జేరి
పారావతధ్వనుల్ ♦ పలుక కున్నె
చాన యింతకు మున్నె ♦ శౌరి పైకొన వెను
దియ్యక యెదురొత్తు ♦ లియ్యకున్నె

తే. గీ. మున్నె యది జాణ సిగ్గుచే ♦ మన్నఁ గాని
విభుఁడు వగ జేసి తనుఁ బ్రీక ♦ పీడజేసి

సీ. ఉసికొల్పి వంచించి ♦ దుసుకలచనుగోయి
చేనట నమ్మనో ♦ చీనె యనుచు
మొనసి యేమరజేసి ♦ మోవాన గమకింప
వడినుల్కి కరపల్ల ♦ వముల గప్పు
నల్లందులను జొచ్చి ♦ యటు నీవి వదలింప
మిటమీనె బెటు ♦ కొట్టుకాదు
విభు డందు జెనక తా ♦ కికికికనవ్వుచో
నలు గిరుక్కన నవ్వ ♦ యులుక నించు
తే. గీ. తను గురించిన గని తన ♦ కనల మూయు
గనకవల్ నించుచో వ్రేళ్ళ ♦ చెవుల బొనుప
కొనుని భామానినియుం ముగ్ధ ♦ తనము బూని
రాజగోపాలసంగమా ♦ రంభకేళి 124

వ. అంత. 125

ఉ. ముద్దుపెటుకొంత జారి ♦ మోముగదంపుల నింత మోహపుక్
మద్దెలచేవంత తెలి ♦ చూపుల నంత విరాళిచేతలం
బ... మంత పావురిపు ♦ పల్కులు పల్కు కలంతసిగ్గు నా
దిగు మురారి నారిసలు ♦ తెల్వి ... కొని మావియానుచుక్. 126

మ. అలరుల్వాడిడ రుమాల వీడ నెదపై ♦ హారాళు లల్లాడఁ ప
క్కులచొక్కటుసిరియాడఁ బావురఫుబ ♦ లుక్కల్ పలుక్కుచున్ గులుక్కుచున్
బలుకొట్టుచు నిబ్బదట్టునను పై ♦ పైనిక్కు చుక్ సొక్కుచున్
గళ కెల్ల నరగించి యేసెగ గజం ♦ గంజామృకయ్యాంబుజన్. 127

చ. గొనకొనుసిగ్గు మోహమును ♦ గూడగనొక్కటి కొక్క టెక్కుపై
పెనఁగొను కేలు మోముపయి ♦ పెట్టుక మెల్లన వేళ్ళసందులక్
గనుఁగవ నెప్పలొప్పక యి ♦ గాగగ గన్నెని శౌరి వక్త్రముక్
మనసిజ కేళి నైపుణిని ♦ మానక మానినియప్పు డెంతయున్. 128

చ. ఉలుకును గొట్టుకాదు నగు ♦ నూర్పులడంపు మ నూర కుండుగో
గిలగును బల్కు బోవు దట ♦ కాపాడు గన్నును గన్మొగుడ్చు నెఁ
బాలకల దార్చు గుక్కిళడు ♦ బొమ్మల మైమరచున్ సఘోన్నతిం
దలకొ ప్రావశ్యముఁనఁ ♦ దామరసాక్షి యదేమి చెప్పుమన్. 129

సీ. మోమొకించుకయె ... ♦ మోడియానగనొత్తి
యుడియుచనాలించి ♦ యట్టెయుండు
గాఁగలింపగ జూచి ♦ కరిపన్నములజూచి
యుండుదు కిందుకు బోక ♦ యట్టెయుండు
జనుల గుమ్మగి గోటి ♦ సరస మెల్లన జేరి

యవల కీవల కేగ ♦ కట్టెదురుండు
పౌరువరతికెచ్చి ♦ పైకొన గమకించు
యాటు వీటులనుజేయ ♦ కట్టెదురుండు

తే. గీ. ముద్దులిడ వచ్చి యందందు ♦ బొద్దుపుచ్చి
బలుకఁగా మీఱు నెలుగెత్తి ♦ కలకబాఱ
విడె మొనగ బోవు సగమాకు ♦ మడచి మానఁ
దీరి తీరని సిగ్గున ♦ దెఱవయపుడు 130

వ. ఇట్లనేకవిధంబుల నిశామాధవులు భంగరావంగసంగరక్రీడా పరవశులై యున్నయెడ. 131

చ. భువిబధికాళి యాత్రలకు ♦ బోవగ నైష్ఠికవిప్రసంఘముల్
జవమున లేచి తానములఁ ♦ వల్పరతాంతరను స్తదంపతుల్
గవిసి గమింప వేళయిది ♦ గాదెయటంచు ద్విభంగుల న్నెరా
హవణికె నుగ్గడించెఁ జర ♦ ణాయుధబోధకయూధ ముద్ధన్. 132

చ. అంతట దిగ్గనన్ బరుపు ♦ నంటకలేచి పయంట దిద్దుచున్
వంతనుగొంత్ర దాచి బల ♦ వంతపుహాయి రవంత పూని చె
క్కింతులు చెంతలం బిలువ ♦ కేగిన దేమొ యటంచు నల్కరాఁ
గంతుని తండ్రిని గ్గదియ ♦ గా జని రాధిక తల్పుతట్టినన్. 133

తే. గీ. చేరి యందాకవారు చా ♦ శీతిబంధ
గతుల బెనగి చాలక పురా ♦ రతులఁగలసి
బడలికలు దీఱ నొక్కింత ♦ పవ్వళించి
మదవతీ కృష్ణులప్పుడు ♦ నిదుర లేచి 134

సీ. నీఁ మిసిమి చెక్కులదమ్మ ♦ రసమువాథుడు పెంచ
ఓకవాణి మోవి కా ♦ టుకను బెంపఁ
జెదరిన ముంగురుల్ ♦ శ్రీనివానుడు దిద్దఁ
గాంత జారినతిల ♦ కంబు దిద్ద
వలగోరువంకల ♦ నతడు కుంకుమనించ
గలికి పల్గంటికిఁ ♦ గప్పురముంచ
గప్పుపెన్నెరికొప్పు ♦ కాంతుడల్లన బాపఁ
జెలియు హారావళుల్ ♦ చిక్కుబాప

తే. గీ. జుటిసగమాకు నోటిఁ ♦ సుదతియొసగ
మురవైరి కౌరికిన ♦ మడుపు లొసగ
వట్టియొడ రాధకంఠకంక ♦ ణాళి ఘల్లు
రవగ విని నులములు ఝులు ♦ మనగ నలికి. 135

తే. గీ. కలికి వేగ లేచి గడె దీసి ◆ తలుపు దెఱవ
గారవమ్మున రాధిక ◆ చేరబోవు
నంతికుసుమము లెన్నొ హరి చెవి ◆ చెంత జేరి
చెలువు చిలుకంగ ననె నాతి ◆ చేతిచిలుక. 136

సీ. నాళీక గ్రొప్పున ◆ నల్లకల్వలు గావు
విరహాదిశరములౌ ◆ సరసిజాక్షు
నెలత నాసిక యందు ◆ నీలంపు నణె గాదు
ముక్కెరముత్యంబు మరిస్థాల
వనితపాలిండ్ల పై ◆ వలమొకస్తురి గాదు
మలయపంకజంబు ◆ మదనజనక
తరుణి నెమ్మేన గ ◆ దంబపుప్పొడి గాదు
వెలిదమ్మిపుప్పొడి ◆ విమలచరిత

తే. గీ. మరునిశరవహ్ని దరికొని ◆ మదిని బొదలి
వెలికి విసరంగ దాని లో ◆ పల వడంచి
యిదిగొ వచ్చెను బరితాప ◆ మడప ఘనుడ
వీ వటంచును రాధ యి ◆ దెంతధీర. 137

చ. జలరుహపత్రనేత్ర విను ◆ చందనగంధిని రాళి యెంతొ మై
నిల గలసొమ్ము లంగజాని ◆ యింగలమందు గరంగి పూచిలై
మిలమిల డొల్లి రాల జెలులు ◆ మణుల్ బూచు లటంచు బట్టి చే
తులు తెగ లంటి పొక్కి నెత ◆ తో విదలింతురు మిట్టిమీనులై

తే. గీ. లేమకును నీవు పొత్తున ◆ లేనియట్టి
వాసరము లెల్ల శ్రీహరి ◆ వానరములం
మానినికి నీవు ప్రక్కను ◆ లేనియట్టి
రాతి రెల్లను మరి శివ ◆ రాత్రి యగును. 139

కం. కన లేదో విన లేదో
కనులార న్వీనులారగ ◆ గాంతులు కాంతల్
ఘనవిరహాగ్ని ప్రముక్కగ
గన విన లే దిట్టివలపు ◆ కంజదళాక్షా 140

కం. అనిపలుకు చిలుకుపలుకులు
విను వనజదళాక్షు జేరి ◆ వేడ్కను రాధా
ఘనవేణి యిళ్లను జూపుచు
దనదగు ప్రేమాతిశయము ◆ దనరగ నగుచున్. 141

సీ. చిగురాకుజిగి నూకు ◆ చెలియకెమ్మోవికా
గజిబిజి మొనపంటి ◆ గంటు లెల

నవచెంపములను జెందు ♦ నాతిలేఁజనులకా
కలికిగోటిపిరంగి ♦ నఖుకు తెల్ల
ననునాచులను సేచు ♦ నంతపెన్నెరులకా
కక్కసం బగు పెక్కు ♦ చిక్కు తెల్ల
మసవంపుగురి గింపు ♦ మగువ నెమ్మేనికా
విడువనిమగసామి ♦ బదలికెల్ల

తే. గీ. నకట మగలకుఁ దమయక్క ♦ కైనజాలు
నబలలా గెంచి లాలించ ♦ నను చు నిళకు
వగచుగతి రాధ తనలోని ♦ వంత దెలియ
జేసె శౌరికి నవ్యాప ♦ దేశముగను. 142

చ. అని విని శౌరి రాధకర ♦ మల్లన బట్టి బిరాన చేసరాల్
గుదురుగఁ గంకణంబులును ♦ గూడగ ఘల్లుమటంచు మ్రోయగా
గని యాఁగఁ దీసిన సతికి ♦ కాంతుని పేరెద వ్రాలె నంతలో
గుదిగొని సిగ్గుచే నిళయము ♦ గొబ్బునఁ జాటున కేగ నవ్వుచున్. 143

తే. గీ. మారుఁ రే బొబ్బ హోయిగే ♦ మజ్ఝ బళిరె
కలిసి పిరికయ్య మాత్రేఁ ♦ మూలవితాన
నీడు లే దని వలపుల ♦ తేఁడు సాగద
నపుడు వారిర్వు రాకయ్య ♦ మందుకొనిరి. 144

వ. ఇట్లు వికిఁబడి. 145

సీ. కొసరుపలుక్కులఁ గ్రమ్మిఁ ♦ గోటికస్తుకలఁ జిమ్మి
కాసెలోఁ జెయి వేసి ♦ కడియఁదీసి
కవ్వాత లాలించి ♦ కౌఁగిటఁ గదియించి
సరబిత్తెల నెత్తి ♦ చనుఁలనొత్తి
యల్లందులకుఁ జొచ్చి ♦ కల్లమ్ములకు వచ్చి
మెఱుఁగు చెక్కిలి గొట్టి ♦ కురులు వట్టి
తొడకంభము వాని ♦ తోపునూకుల నూని
సందుచేముక నొక్కి ♦ ముందు కెక్కి

తే. గీ. యదలుపులు కీలుగొట్లు నె ♦ య్యంపుతిట్లు
గళరవంబులు దుడుకులు ♦ చెలఁగ రాధ
మాధవుండును గడిజేరి ♦ మారుసాము
హోయిగాఁ జేసి సరిగెల్వ ♦ లంది రపుడు. 146

వ. అంత రాధాకృష్ణులు పరస్పరము సంభాషించి రది యెట్లనినన్.

సీ. మగడ యాడని దీకె ♦ మఱియొక యాటాడి
నాకును గట్టిగా ♦ న్యాయ మొసంగి

పాలఁతి నీపెంఁదొడ ◆ పుణ్యంబు నా కండ
లేఁతచిన్నది వట్టి ◆ గోఁత నాకు.
నీకు దానికి నింత ◆ నేస్తమాయెను కృష్ణ
పొంతగా నినుఁ గూడి ◆ యింత బాగ
చెలియ నిమ్మళముగ ◆ జేసితివో [illegible]క
యది చేసెనో నిన్ను ◆ నడుగ వలను

తే. గీ. బాగుబాగన గట్టిగా ◆ బని యొసంగ
నియ్యరా కృష్ణ నాకున ◆ నిమ్మగాను
తీవి వయసున గుణమున ◆ నీకె పెద్ద
రయము రయమునఁ గావింపు ◆ రతిని రాధ. 148

సీ. అధరామృతంబు నీ ◆ వానితివో కృష్ణ
యది లేఁ జిగురువగ ◆ రంతె రాధ
కఠిన స్తనము లెద ◆ గలఁచితివో కృష్ణ
యవి లేఁతలికుచంబు ◆ లంతె రాధ
లలితోరు యూరుల ◆ పెలచితివో కృష్ణ
యవియనంటులత్వక్కు ◆ లంతె రాధ
లీలాంగములు కౌఁగి ◆ లించితివో కృష్ణ
యవి వనలతకూన ◆ లంతె రాధ

తే. గీ. చతురసమరతిసుఖ ◆ మొనర్చితివో కృష్ణ
నవసమాగమమున సౌఖ్య ◆ మవును రాధ
యుపరతుల నిన్నుఁ గూడెనే ◆ మోయి కృష్ణ
యాచమత్కృతి ముగ్ధ కెట్లబ్బు రాధ.

వ. ఆసమయమునందు. 150

సీ. కాలివాల్ పిట్టల ◆ కలకలంబులు మీఱెఁ
బగడకన్గలయొజ్జ ◆ బయలుదేఱె
నెలరాజు వచ్చిమా ◆ చలరాజమున్ జేరె
బలుచంద్రకాంతపు ◆ శిలలు పేరెఁ
దారకాగణముల ◆ తళుకు లెల్లెడ జాఱె
దీపంబు లెల్లను ◆ తెల్లబాఱె
నతనుడు కేయొల్ల ◆ ననిఁ జేసి వేసాఱె
ధర వియోగులబరి ◆ తాప మాఱె

తే. గీ. దమ్మిలలరారెఁ గలువల ◆ తావు దీఱె
గోకములు తేఱెను జకోర ◆ కులము తారె

నినుడు గడికేఁగె నిరులు మొ ♦ యిడ్లఁ దూఁగెఁ
జెలిని చేకూఁడె ఘల్లనఁ ♦ దెల్లవాఱె. 151

మ. యమునాతీరవిహార హారసదృశో ♦ ద్యత్కీర్తిసంభార భా
రమణీయాకృతిమార మారసికతా ♦ ప్రావీణ్యసంసార సా
రమురంవోక్తివిచార చారణనుత ♦ ప్రఖ్యాతవిస్తార తా
రమహీభృత్సుమధీర ధీరమునివా ♦ రాధార రాధారతా. 122

కం. ధరాళిమతోద్ధారా
ధారావర కృత్తిమత్త ♦ దానవవారా
నారాశినిభగభీరా
భీరాహిత్యానురాగ ♦ విశ్రుతధీరా. 155

మాలిని. కలికలుషనిఫాలా ♦ కాంచనోద్భాసిచేలా
గళధృతవనమాలా ♦ కాంత రాధావిలోలా
బలభిదుపలనీలా ♦ పాండవత్రాణశీలా
తిలకితగుణజాలా ♦ దేవకీగర్భబాలా. 153

ఇది ప్రథమాశ్వాసము.

---

శ్రీరస్తు.

(ఇళాదేవీయ మనునామాంతరముగల)

# రాధికాసాంత్వనము.

## —♦ ద్వితీయాశ్వాసము ♦—

శ్రీరాధామధురాధర
సారామృతపానచతుర ♦ సద్గుణహారా
పారావారవిహారా
భారతసఖ చిన్మయకృష్ణ ♦ పాలితకృష్ణా.

తే. గీ. అవధరింపుము దేవది ♦ వ్యానుభావ
వ్యాసమునినూతి జనకభూ ♦ విభుని జూచి
...కొంట పూజించి కొర ♦ యుక్కొరలకు
రెక్కడై మించు నడిచవు ♦ లెక్కఁ బలికె.

కం. అటుల రాధిక గోపి
విటు నటు రతికేళి నేలి ♦ విడువంగా నిల

కుటిలాలక జేరి తనదు
కుటిలత్వ మెఱుంగనీక • దూరిమి చెలగన్ 3

తే. గీ. విసుమిగుల గాసి యిడెనని • నే మురారి
నా పై పైకొని దండింప • నీవు విదిరి
సందుచేసుక రొంచటికి • జరిగి తనుచు
విళను జేబట్టుకొని రాధ • యింటికేగ 4

వ. అప్పుడు. 5

సీ. మహితగండస్థలీ • మకరికాపత్రికల్
కొసలివాపోగుల • పసలు చెలుప
మెఱుగుచన్గ్రోవ గర్విమ్మ • మెఱయుతమ్మరసంబు
పటుతరకౌస్తుభ • ప్రభఘటిల్ల
తలిరువాతెర నొప్పు • బలుకెంపు అలవేణు
వివరంపు నొక్కుల • విధ మెసంగ
నలిగి చెన్నునఁ గుల్కు • తెలిముత్తియపుజెడ
పన్నగతల్పంబు • చెన్నుదవర

తే. గీ. హారగతమణి శ్రీవత్స • సార కాంతి
దశదిశల్ నిండ రాధికా • తరుణితోడ
శౌరిసారూప్యమంది యిల్ • చేరవచ్చు
విళను గన్గొని యలివేణు • లిట్టులనిరి. 6

సీ, మనినీకాటున కెందు • మందు లేదందురు
మంచిది ఘనసార • ముంచరమ్మ
చిఱుగోటిపోటులు • సెలవారునందురు
పునుగుకుంకుమగూర్చి • పూయరమ్మ
తోడసాముచే గండ • లెడ గట్టునందురు
చలువగొజ్జగునీట • జల్లరమ్మ
వలపు చెమ్మటలింక • జలిపట్టునందురు
కలపంబు నెనయించి • యలదరమ్మ

తే. గీ. కమ్మవిలుకాని యేనుగు గున్న బడలెఁ దళుకుచెక్కుల సొంకవ • తైలమంచి
యలరు మందులపొడి బూసి • యలుపుదీఱ మేటి తాంబూలకబళంబు • మేపరమ్మ 7

కం. అని మిగులతగల బల్కుచు ఘనతర సురతాంతతాంత కాంతామణికిన్
ఘననిజ శా. స. ।కమమున దను కలయిన దీరిరంత దదయవేడుకన్ 8

చ. అలరుల మోవి కాటు పస । పంటిన దుప్పటినీటు చెక్కులన్
విలసిలు తమ్మ ముద్దు జిగి । తెన్నన గీల్జడ దగ్గు కన్నులన్
వెలకొను నిద్రసొక్కు మెడ । నెక్కొను గాజుల నొక్కు లెంతయున్
దెలియఁగఁ గేళిమందిరము । దిల్వడె మన్మథమన్మథుం డొగిన్. 9

తే. గీ. ఇటుల వెలువడి మజ్జన । గృహముఁ జేరి చలువగొజ్జంగినీటిచే । జలకమాడి
వలువలుధరించి కలపముల్ । గలయఁబూని యతివవడ్డింపదివ్యాన్న । మారగించి 10

చ. పడఁతి యొకర్తె కెంపుగవ । పావలు వెట్ట నొకర్తె యొక్కతె పా
వడఁ గొని వీవ నొక్కమద । వారణగామిని తావిఁ బ్రపున్
విడె మొసఁగన్ మఱొక్కతె నవ । నీరద వేణి కళాచిఁ బూనఁగా
నడిదము కేడెముం గొనుచు । నంగన యొక్కతె వెంబఁ గొల్వఁగన్.

సీ. మగరాలకెంబాళ । నొక యంత్రపాంచాలి కలు మీటువీణల । గులుకు రాగ
ముల సొక్కి తలలూఁచు । జిలుగుబంగరునీటు వ్రాఁతచిత్తరుబొమ్మ । లనుగురించి
యొరలెడు చిలుకల । గొరవంకలను నవ్వు నిలువరినగవులో । యివి యనఁదగు
ముత్తియంబులతీఁగె । ముడికట్టు పసుల హారం బట్టుమేల్ కట్టుల । వఱలు విరుల
సరులమూఁగెడు తేఁటుల । గరుల మెరయుల్లని యాడునాఁడు నెమళ్ళ । నడుగుటందె

తే. గీ. అందమగురోదరతినాద మనుచు నెపుడు నిలువుటద్దాల పడకిళ్ళ నలరుగూండ్ల
రమణఁ బలికెడు పారావతముల నెసఁగు రాధికామణి మణిసౌధ రాజమునను 12

తే. గీ. చేరి యట వింతపనులచే జెలువు గులుకు చలువ చప్పరకోళ్ళమంచంబుమీఁది
యంచరెక్కల సెజ్జపై నలరు ముత్తియంపులోదునఁ దగఁ జేరి హానుమీటి 13

తే. గీ. అంత నటు నిల్చియిలో ముత్తియంపుమున్న మిడినతముల పుటాకుల మడుపులియ్య
గదిసి రాధిక తనచనుఁ గవకు బులక లమరఁ జూచిన పాదపపద్మముల నొత్త. 14

సీ. తంబుర మీటి గీతంబు పాడుచు నొక్క ముఘురోష్ఠి సరిగమపదని యనఁగ
జగ్గుచౌకట్లను సగ్గడింపుచు నొక్క చక్కెరబొమ్మ తద్ధిక్కు మనఁగ
గుజరాతి జక్కిణీ కోపులాడుచు నొక్క భామిని జీవుసల్లామనంగ
బిరుదుకైవారము ల్పేర్మి సేయుచు నొక్క సరసిజానన జయజయ యనంగఁ

తే. గీ. చంద్రబింబాస్య యొకతె హెచ్చరిక దెలుప జెలియయొక్కతె సందడి
దొలఁగఁ జేయ
నందరకు నన్నివగల నానందమిడుచు నిండుకొలువుండె యదువంశమండనుండు 15

చ. అపుడు పయఃపయోధిమణి యల్లువ బిల్వంగ నెమ్మిఁ గోరి స
ద్వ్యపుల కులప్రదీపకుఁడు విశ్రుతకీర్తి యశోదతోడఁబు

వ. ఇట్లని వితర్కించె. 24

సీ. కలుగునా కన్నుల కఱవెల్లఁ దీఱంగ కమలాక్షు నెమ్మోము గనుగొనంగ
వేవేగ నబ్బునా వీనులవిందుగా దనుజారి వేణునాదము వినంగ
నలవడునా చేతు లతిపుణ్య మందంగ వాసుదేవాంఘ్రి సేవలఁ బెనంగ
దొరకునా నెమ్మేను పరవశమందంగ వటపత్రశాయి కౌఁగిట మెలంగ

తే. గీ. నొదవునా గోపగోపికా సదయు నెనసి యుసతరానందజలరాసి నోలలాడ
బ్రబల మగుమద్దశాపరంపర లిట్టులుగాఁగ నున్నవో యేమైనఁ గాన నకట.

తే. గీ. రాసిఁ జేసినశృంగార రస మనంగ జక్షులకు దోచుకరుణాతిశయమనంగ
నొకటి రైనట్టి మన్మథాయుతమనంగ బొలుచుగోపాలరూపంబుఁ బొగడవశమె

కం. తమ్ములు శౌరి శ్రీపాదమ్ములు మోదమ్ములొదవు దమ్ముల నెల్లను
దమ్మ లనం దప మలినా దమ్ములు వేదమ్ములు వినదమ్మ్య సలుపును, 25

ఆ. వె. పుంగవములమీఁదఁ బులులును బులులపై గరులు గరులపైనివారులు గవియు
నందగోపసుతుని నడకలాకించుక సాటి తాము తాము తామటంచు, 26

తే. గీ. దానవారాతినఖధాళ ధళ్యములును బ్రపదరోచులు పదరుచుల్ పరిఢవిల్లె
నతని యడుగుల నొకటిగా నతిశయిల్లు జాహ్నవీయమునాసర స్వతు లనంగ.

తే. గీ. తీర్థపాదుని శ్రీపాద తీర్థమందు గలకమతనక్రములు దేలి తెలికివచ్చె
జోడుజోడుగ నన నీడు జోడులేక యతనిమీఁగాళ్లఁ జెలువొందు ననువుమీఱు

చ. సిరియును భూమినీళలును జెల్వగు పల్లవ పల్లవాధరల్
నిరతము లాలనల్ సలుప నిగ్గులు గుల్కెడు శౌరిజంఘలను
గరకరి, జూచి మారజయ కాహళు లూదబడెఁగ నేమగును
మెలి లిడు టెంకె కాని సరి పోలునె పోలిన బోలు జెందవే. 29

కం. నాగారిగళముపై దగు నాగమదధ్వంసితోడలు నాగకరంబుల్
నాఁ గనుకని నగరేయెల నాగఅతో ధీయులైన నాగరజనముల్. 30

ఆ. వె. కౌస్తుభంబుతోడఁ గనుపట్టు ఫణిరాజ శాయిగళము శంఖమాయె ననుచు
గనకపటముతోడఁ దనరుగోపాలక స్వామి కటియుగంబు చక్రమయ్యె. 31

తే. గీ. జానులను జేసుబాహుల సరవిజూచి కనులు చెవులకు వివరింపఁగదియువింత
పొలుపు వినగోరి తలలెత్తె భుజములట్టుల గాన లేనైరినసువంత గౌనుచిక్కె.

తే. గీ. ముజ్జగంబులు కన్నని బొజ్జనున్న తెఱగు వివరించుదారి నాఁద్రివళు లమరఁ
గదిసి వళిభంగములఁ దేలు కమలమనఁగ నలువరుము లీనుకృష్ణుని నాభివనరు.

ఆ. వె. శ్రీయుతంబు గాఁగఁ జెలువరాపద్మగయు గందపట్టెలుండు కరిన దలుపు
హరియురంబు నెదిరి శిరముపేర్వక్కలై మూలయింటిలో నమూతబడియె. 34

కం. కనుపని కాపు పడంతుల చనుజక్కవ లంరఁ జేయు శౌరి నఖంబుల్
చను నే నెలరేఖలు నా ననుపమములు తత్సమంబు లవియే జగతిన్. 35

చ. ఖరమురకంసహంసవరకాదిసురారులప్రాణవాయువుల్
పొరిగొని దివ్యరత్నమయ ముద్రికలొప్పెడిపొంగ ప్రేళ్లతో
హరిభుజకాండముల్ చెలువమందు శిరోమణు లంద మందఁగా
మురువగు పంచభోగయుత భోగుల నీఁగను శ్రీలొసంగుచున్. 36

చ. శరణను వారికి న్మృదువు శత్రులకు న్గఠినత్వ మిచ్చుఁ ద
న్మ్రొలుకసి లీనిపల్లవము లే మెన యెంచు దలంచె నంచుఁగా
మురువగు దేవశాఖిని సమూలముగా, పెకలించి తెచ్చియా
మురరిపుకేలుడోయి యిడె మున్నొకభామ పెరంటిచెట్టుగన్. 37

ఉ. కోరినఁ గల్పశాఖి యొక కొన్నిఫలంబుల నిచ్చు నల్పముల్
కోరిక పొరనిత్యఫల కోటుల నిచ్చు మురారి బాహువుల్.
పోరికి వాని వీనికెటు పోటి యనంగను దీటు లేమిచే
వారక పోల్తురే కవులు వానికి వీనికి దాలుమాలుగన్. 38

చ. అరయఁగ శంఖచక్రముల నంది సుగంధములం ధరించి ప
ల్మరు విను చిక్కనట్టిమహిమన్ ఘనసింధురసేవ్యమాన మై
ధరణిధరత్వ మంది గిరి తన్భుజయుగ్మముమీద నెంతయున్
సరిపడఁ బోరి యెత్తుబడె చాలక యా మురవైరిచేత నే. 39

చ. సరసులు మెచ్చఁగా దనరు శంఖ మనంతము పద్మయుగ్మమున్
నరహరికంఠమధ్యనయనంబులకున్ సరిగా వటన్న చో
వరయుగ బోకలా పిడికిలా యొకచేర లటంచు నెంచఁగన్
హరిహరి వారిమాధమతి శాదియు నంతము గల్గఁ జెప్పనే. 40

తే. గీ. మాను దశనామృతం బెందు జాలనీక కోరి పెట్టిననీలంపు కోర యనఁగ
గొల్లచెలియలసొమ్ము గాఁగొను చుదనయు మదనజనకునిచుబుకంబు మధుర మొందపు.

తే. గీ. కావి గాదది విధుకెంపు దీవి గాని దీవి గాదని యమృతంపు బావి గాని
బావి గాదని కపురంపు తావి గాని తావి గాదది శౌరికెమ్మోవి గాని. 42

కం. తేటలు గా జగిముత్యపు పేటలు గాఁ బంచదార పేటులు గాఁ బూఁ
దోటలు గా రాచిలుకల మాటలు గా కంసవైరి మాటలు దనరున్ 43

తే. గీ. శౌరి ముఖచంద్రునకు పహాసంబు గుచు దగియెంద ధామృతస్ఫూర్తి మృగకుదాంక
మతులితకటాక్షశీతల మైనకళలు నవ్వువెన్నెల కువలయా నందగరిమ. 44

ఉ. మల్లెలు మొల్లమొగ్గలును మంకెనపువ్వు సువర్ణకోశమున్
దెల్లనినవ్వు పల్వరుస తియ్యనివాతెర నిక్కుముక్కునై

యల్లుకొన సుఖాబ్ధిమున నాతఁడు మాధవుఁడా కెఱింగి మే
ల్వెల్లను వీనికిన్ బుధులు చెప్పెడియాను మనోభిధానముల్ - 45

చ- మురహరునాస నోడబడి పోయిననీలపువేణునాదమును
సరి గన లేక చేయబడిన చంపక కాండవిలాససంపదన్
నెరి గని కాదె పక్షిపతి శ్రేష్ఠున ముక్కుడ జేసి తగ్గి త
చ్చరణములంది క్రిందుపడె సన్నుతి నెప్పుడు వీపు జూపుచున్ - 46

కం- సరి లేని శౌరినాసిక సరవనవంశంబు గాదె మఱి దానితుదన్
పరము క్షాఫల మేటికి కెం బగుతిలపుష్పతుహిన బిందువురీతిన్ - 47

కం- అద్దిర నిద్దపుటద్దము లద్దను జవిదారిచెక్కులటు గాకున్నన్
ముద్దపుటద్భుతరసమున కొద్దికయై చూచువారి నొగి లోఁ గొనునే - 48

చ- జలజము కల్వలోకూడెదెప శౌరివిశాలవిలోచనంబులం
దుల గనఁ గోరి హంసతతితో జలమందుఁ దపంబు సల్పఁగాఁ
గలిగెను దోసము న్బగలుఁ గ్రమ్మఱ నాఁకనుపోయి నెంచఁగా
జెలఁగె విశస్వరం బమర శ్రీధరణీకరభూషణంబులై. 49

కం- మారహరుని వంకబొమ్మలు మరునింద్రే కాక యున్న మగువలమనముల్
వేఁగుఁ గైన మాపుతూపుల గురిసి విభేదించు దారి గొను నేజగతిన్ - 50

తే-గీ- తనుఁ దలఁచి దినులికు మెఱుంల్వఁగ లేక యాతులనవదివ్యసంపదలలరఁజెలఁగు
శౌరివినులు శ్రీలై పో సాటె కటులఁ గాక కనుదమ్ములటు మేలు గనఁగనే -

తే-గీ- శౌరిముఖసామ్యమును గోరి సారసారి గట్టుపై నెక్కి తలక్రిందుగాఁగ నెంతో
కాఁక బడెపడి తన చేత గాక కానె యాతనుచిత్తానువర్తియై యాలికయ్యె - 52

చ- వల నగుబుజహ్వముల బాత్రము జోతియుఁ గాగఁ జేసి యా
వ్వాలపుల అసితంద్రి మొగ వాసికి దృష్టి దనినం
జెలిమి ఘటిల్ల నప్పుడో చెల్వము గాంచి ఘనంబు మించి హం
సలకుఁ గలంగ కే యుభయ సంపద లందె దమఃప్రసక్తిగాన్ - 53

తే. గీ. ఇరులు గావని నీలంపు సరులు గాని సరులు గావని మగ తేఁటి గఱులు గాని
గఱులు గావని మరువేట యురులు గాని యురులు గావని శౌరిముంగురుని 54

సీ. ఈకప్పు పెన్నెరి కెనయౌనె సోకముల్ నీలాచలముపైని నెగడినంత
నీయొప్పు క్రొమ్ముడి కెనయౌనె నునునాచు యమునాజలంబులో నల్లినంత
నీనిడుకీల్జడ కెనయౌనె రాహువు సుకృతమోవిఖ్యాతిఁ గొన్నయంత
నీగొప్పకొప్పున కెనయౌనె శిఖికోటి ఘనులతో బహుమైత్రిఁ గన్నయంత

తే. గీ. వసఁగ వలగట్టి మృదులత్వ మందిచిక్కఁగొనక భంగమైకొనసాగికనుల కెసఁగి
చెండుపడకయె యొప్పుడొక్కఁదండిపన్నెఁ జెందు గోపాలకస్వామి చికురభరం 55

సీ. శకటారి నెమ్మోముసరి యొందు లేదని ద్విజరాజుపై నానఁ బెట్టవచ్చు
శౌరికన్నులతోడ సమ మెందు లేదని తమ్ములఁ బఙ్కైచి దాఁటవచ్చు
మురనికన్నయ మోవి సరియెందు లేదని యమృతంబు ముందర నాడవచ్చుఁ
క్రీడబావయురంబు జోడెందు లేదని ధరాదిశేషుని ఫణమంట వచ్చు

తే. గీ. కంసరిపుమధ్యసామ్యంబు కలుగదనుచుఁ జెప్పిహరిముందర నె బాససేయవచ్చుఁ
కృష్ణదేవుని రూపమింకెందు దొరకఁబోదటంచు మనసిజునైన ముట్టవచ్చు. 56

కం. ఇల రాయరాయలగుమాయలరాయల నెంచి యూచ కాచకమదిలో
నలరాయల నలరాయల నలరాయల నెన్న సృష్టి పాత్రలు గారే 57

ఉ. అనఘ లా మెఱుంగుతోడ లారసికత్వము లావిలాస మా
మేని మెఱుంగులా మెలక మీపపుగంగులు నాబెడంగు లా
నూతనరాసతంత్రపరిశోధన లామధురస్మితంబు లా
పూనిక చొప్పు లాపలుకుపోడిమి యానెఱజాణకే తగున్ 58

ఉ. మాటలు ముద్దుపద్దులును మక్కువ టెక్కులు త్రెక్కుసొక్కులున్
గాటపు కౌఁగిలింతలు నగల్ గిలిగింతల మీటువింతలున్
మాటికి మాటికి న్నలయు మాలిమి మేలిమిఁ జూదినట్టియే
యాటది వాని వీడు నకటా కనురక్కసి నన్ను దక్కఁగన్ 59

మ. అని చింతించుచు మించుబోడి దనకున్ బ్రాణావనోదారమై
వనజిస్యందమరందబిందువిలప ద్వాగ్గోరణీ సారమై
యనవద్యాఖిలలోక వర్ణితమనోజ్ఞాకార మాకేరమున్
గని తా నిట్లనె నూనశాయకళగా ఘూతార్తచిత్తాబ్జయై. 60

మ. ఇదిగో వచ్చెదనంచు బోయి బహునాళ్లైగన్ మహాబ్జంబులై
పదయుం డేటికి రాఁడు నాయొడ గటాక్షం బెల్ల బోనాడెనో
మది దా వీడెనో కూడెడోయికను రామా జీవ మూటాడెడిన్
మదవత్క్రూరదవానలం బదనమై పై వంటఁగాఁ గీరమా 61

ఉ. కంటికి నిద్రరాదు విను కాంతుని బాసినవాటినుండియున్
వంటక మింపుగాదు పెరవార్తలువీనుల సోఁకలేవుఁ నే
డొంటిగ బ్రొద్దుపొద్దు మరులూరక యుండగ నీదుతొల్లియే
[illegible] 62

సీ. వానిమోమును జూచి నేనేల మరులైతి జిగిచందమామపై సెగటుదోప
వానిమైసోఁక నెంచి నేనేలఁ వలచితి గలువలపాన్పుపైఁ గనటు వొడమ
వానినవ్వుదలంచి నేనేల చిక్కితిఁ జిక్కని పాలపై జేఁదుగొనఁగ
వానిమాటాలించి నేనేల లోనైతి జిలుక పల్కులపైని జుల్కనము
తే. గీ. వానివాతెర నేనేల యానగంటి జివిచక్కెర యుక్కెరం తేనిమాన
నిందు కేమందు నేఁ గదు నందిలిఁదు నెపుడు హరిపొందు గనుగొందు నెట్టులుందు

సీ. కనుఁగన హరిమోము గనఁగొన నేకోరు వీనులు హరిమాట వినగగోరు
నాసిక హరిమేని వాసనగ్రోలగోరు నధరంబు హరిమోవి యానగోరు
జెక్కులి హరిగోటి నొక్కు లెక్కు లెకోరు గుబ్బలు హరిబొమ్మ గుమ్మగోరు
గరఁములు హరి సెంతో కౌఁగిలింపఁగఁగోరు నేను శ్రీహరిప్రక్క మెలగగోరు
తే గీ. నిన్నెరుంగక కేటే కోరు విదిగొ నాను మనసు గోరడిగోరికల్ మట్టులేవు
మత్తమెందుకు మదనసామ్రాజ్యమిచ్చి నెగడు హరియె యాయుర్ద్రాయముగుటకుకవు.
తే గీ. మనసుఁ కరగను హరిముద్దుమాటవిన్న మోహ మెదనిండు హరినగుమోము గన్న
దమి చెలంగును హరిచెంతనిముషమున్న మరువవచ్చునెయెవ రెంతమరువుమనిన. 65

సీ. హరిపేరు రమ జూచి నంతజన్గుబ్బలు సిగ్గుమాలుచు రైకచిటులను బ్బు
బసిగాపురాయుల పల్కు విన్నంతనే వీనులకమృతంబు విందులగును
మీసాంకుతండ్రి నెన్నేనుసోకినయంత బులకలు తనుపెల్ల మొలకలెత్తు
గమలాక్షుతాత్ముని గదిసి పైకొన్నంతఁ దమినిండి తండోపతండమగును
తే గి. నందనందనుఁ డబ్బెనా నవనిధానములును దక్కనచందానఁ జెలగు జిత్త
మూతునోహరులఁబాసి నేఁడడల వ్రాసె నౌర తలవ్రాత తలకొట్ల మారిధార. 66

కం. చెలువునగన్గొనుటకు నాపలుకునఁ జని చిక్క నేమొ పరిపరిగతులన్
బిలిచిన రాదిచ్చటికిం జెలిమిగలుగు నాదుమనను చెలి యోచిలుకా 67

కం. వీడుదు బంధులమగనిన్ వీడుదు ధనధాన్య గేహవిభవము లెల్లన్
వీడుదు ప్రాణము లొడ్డలన్ వీడంగాఁజాల హరిని వేయన నేలా. 68

ఉ. ఎంతని విన్నవింతు హృదయేశుఁ డొనర్చినవింతలన్నియుం
జింతకడంబులాయె మనుజేసిన బాసలు దప్పులాయె ని
న్నింతులు నవ్వ నాయె నెతలెందు తలిన్విడఁ గూడదాయె నే
నెన్నంతయుఁ దార నాయెనిఁక నేటికి మాటలు ముద్దుకీరమా. 69

కం. కలగంటి నిన్నరాత్రిని కలకంఠిని గూడి హరిఁ గరకరి నాపై
గలకంటినగతి నిది గోకలకంఠధ్వనులు కర్ణ కాండములయ్యె॥ 70

ఉ. కావునఁబోయి నీవిపుడు గావుము కోరిని దెచ్చి కూర్చి నే
గావుగ నన్ను నేగదికి కాముడు డెంతయుఁ బంతగించె లో

జీవము లాచరించె దమి సిగ్గునడంచె విరాళి మించె పై
దీశ చలించె దాయ యాయె దేవుఁడు నన్నిటు ముంచెఁ గీరమా.

సీ. నాకృష్ణదేవుని నాముద్దుసామిని నాచక్కనయ్యను నాదుహరిని
నానోముపంటను నారాజతిలకుని నారామితమ్ముని నాదు విభుని
నామనఃకాంతుని నానందతనయుని నాప్రాణనాథుని నామత్ప్రియుని
నామోహనాంగుని నానీలవర్ణుని నావిటోత్తముని నాధుసఖుని

తే. గీ. చేరి కన్నుల కరవెల్ల దీరఁ గాంచి చాల నడిగితి మ్రొక్కితిఁ గేలుసాచి
కౌఁగలించితి గరములు కనుల చేర్చి కొంటి రమ్మంటి మదివేడుకొంటివనుమి.

సీ. మోహనాంగుని దివ్య మోహబింబమటంచు
మదిం జొక్కి నామాట మరువవలదు
నళినలోచనుని లేనగవు వానవా అంచు
మరులెక్కి నామాట మరువ వలదు
కంసారి పలుకులు కండచక్కెర అంచు
మదిఁ దక్కి నామాట మరువవలదు
రమణు చల్లనిచూపు అమృతపూరమటంచు
సొరిఁ జిక్కి నామాట మరువవలదు
కమలాక్షుకరములు కల్పశాఖలటంచు
మదినెంచి నామాట మరువ వలదు

తే గీ. వానిఁ గనిరేని ఘనమోహ వనధిలోన
మునిగి మున్గుదు రయ్యాదిమానులైనఁ
బలుక నేటికి మనవంటివారిఁ గాన
గీరమా తెల్విగొని తెల్పు శౌరితోడ. 73

కం. ఇక చెంత నాథుఁ డుండఁగ
బలుకం బోయెదవు నాదు పలుకులు చిలుకా
వలి దీసి యొంటికొలువునఁ
జెలువునితో విన్నపంబు సేయుము చిలుకా. 74

కం. అనుచిలుక లొలికిన గని
కనికరమునఁ జిలుక పలికెఁ గలికిరో వినుమా
వనరుహనయనుడు మతి మది
విను గడ నిడి థళి మఱొక్క చెలతలు గొనుగా,

సీ. గలికి నీకంఠంబు కరణి నున్న దటంచు
  నీకటితటిదారి నెగడె నంచుఁ
గాంత నీయూరుల గతి జెలంగ నటంచు
  నీయారుతీరున నెగడె ననుచు
జాన నీబాహుల చందాన మించె నటంచు
  నీముక్కు చెక్కున నెగడె ననుచు
బాలతి నీకొప్పుచొప్పున మేలు గనెనంచు
  రోమము గోమున నెగడె ననుచు

తే. గీ. శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గములను
వేణుశిఖిపింఛపద్మము ల్వీడక పూని
నట్టి హరివిన్నవిడుచు నా యుడలవలను
నిమిషమున జెత్తు నే వాని నీలవేణి. 76

కం. జలజధివాదుల చేత
దెలివిగ చే రానివాని దే నోపుదు వే
ధళిధళి నీ కనజెత్తును
బలుసోదరు నీకటాక్ష బలమున జెలియా. 77

కం. అని పలికి కలికిపంపున
జని ముద్దులు చిలుకుచిలుక జకజద శాత్రుం
గొని వత్తు నందు నంతట
వనిత సఖుల్గోలుక గేళి వనమున కరిగెన్. 78

తే. కొమ్మ యీగతి జని కొమ్మ కొమ్మయందు
నూతనం బగుదళములు నూల్కొనంగ
మరునికో టగుపూఁదోటఁ జొర నెలవఁగఁ
జొరవ నుడివిరి తెఱవలు మఱువుపడఁగ. 79

చ. సకియరో చూడుమా కనులు చల్లగ నల్లదె మాధవుండు వా
రక కుసుమనోవికాసుఁ డయి ప్రాప్తవసంతప్రియుచిద్విలాసుఁ డై
శుక ముఖ సద్విజప్రకరసూనృతవాఙ్మయుఁ డౌచు గోపికల్
కకవికఁ జుట్టఁ బెట్ట వనలక్ష్మిని గూడి చెలంగె వేడుకన్. 80

చ. పొగడలు చెంగలించె కుంపొన్నలు క్రొన్ననలుంచె మావులం
జిగురులు మించె సంపెఁగలు చెల్వు వహించె రసాలసాలము
ల్పొగడలు నించె గొజ్జఁగిగము ల్వికసించె నశోకభూజము
ల్పొగరు ఘటించె మించె గదళుల్ కనశేఖున వేణి కామిణీ. 81

చ. ఘనకమలాశ్రయత గాంచిన హంసలు మాధవస్తుతిం
జను పికముల్ హరిం దలఁచు చక్రపక్షులు కృష్ణవర్ణముల్
గొనలును దేంట్లు మారగుగు గోరి వహించు శుకంబు లొప్ప మే
ల్లని పురుషోత్తమస్ఫురణ గైకొనెనీవసిఁ జూడు భామినీ. 82

కం. ఇటు లాడు చెలుల మాటలు
కుటిలాలక యాలకించి కొంకకుఁ గొంతన్
దిట మూని కేళివనమును
జటులగతిం జొచ్చి పల్లఁ జని చనియుచటన్. 83

సీ. పున్నాగములఁ జూచి పున్నాగము లటంచు
భ్రమ గొని లేమావి గుముల జేరు
లేమావిగుములను లేమావిగుము లంచుఁ
దారాడి స్యందన తతికిఁ బాఱు
స్యందనతతులను స్యందనతతులని
జాల నొంది పరవీర తతులఁ గోరు
పరవీరతతులను బరవీరతతు లంచు
బెదరి కెంజిగురాకు పొదలు దూఱుఁ

తే. గీ. పొదల మదనుని విరియుంప పొదలటంచు
వగల గొజ్జంగినీటి కాలువలఁ దారుఁ
జెలుల పైఁ జీకు వేమారు కలఁకఁ బాఱు
జాలి చే మీఱు వేసారు విధని దూఱు. 84

కం. ఈరీతి నచట నిలువక
తారాడుచు నొకరసాలతలమూలమునన్
జేరి విరిపాన్పు మీఁదను
నారీరత్నములు గొలువ నవలా చెలఁగెన్. 85

తే. గీ. కోకకుచ కాఁకఁ బడఁ జూడలేక లోక
బాంధవుం డస్తమించెను బశ్చిమాద్రి
కువలయద్వేషి యయ్యును గొమ్మ వంతఁ
గనఁగ లేఁడన నిక్కుల ననఁగ నేల. 86

సీ. పటి సంజ గనిపించె విరహులపై వల
రాజు గ్రక్కినకోప రసమనంగఁ
దిమిరంబు తిమిరించెఁ దెగి పాంథులను గుంచె
మరుఁడు చిక్కించిన మాయ యనఁగఁ

దారక లదుకొంచె మారుండు పథికులఁ
గూల్ప నించినచిచ్చు గుం డ్లనంగ
విధుబింబ ముదయించె నెస వియోగులనొంప
స్మరవీరుఁ డెత్తిన చక్ర మనఁగ
తే గీ. బొండుమల్లియరండముల్ పూచినటుల
బండుకొన్నెల బ్రహ్మాండ భాండ మెల్ల
మెండుకొనె విప్రయోగుల మీఁద కంబ
రారి వైచిన కలికుదారం బనంగ. 87

చ. కలువలు మీరకుమా కాండము తార జతోరపంక్తి వె
న్నెలరుచిఁ గోర జక్కవల నీటులు దీరె విటీవిటాళి స్వే
రలుకలు జాకె నూళ్లరు డమ్ములు నూకె సుధాంశురాలలో
పల జల మూరె దంపతుల బంధుర తాపము లాకె నంతటన్. 88

చ. కొసవిలుకాఁడు లోపలను కల్పుల గాలియుఁ బైని చంద్రుడున్
జడిగొని చుట్టు గీరములు కారికలు న్బకహంసముల్ నెరా
యిడుముల బెట్టఁగాఁ గలికి యట్టటు బెట్టుగ గొట్టు కాడుచున్
బడలి విరాళి తేఁ గుముద బంధుని గన్గొని సైచ కిట్లనున్. 89

ఉ. తోయధిరాజుకుం బొడమి తోయజవాసిని తోడబుట్టి యా
తోయరుహాప్తుజం టగుచు తోయజనేత్రునకు న్మఱంది వై
త్రోయఁగ రానిచీకటులఁ ద్రోయుము గల్లని తెల్వి చెందియున్
నాయమె నీకు జెంగలువ నాకుడ నింత సేయగన్. 90

తే. గీ. కాలమహిషాధరూఢతఁ గదలి వచ్చి
కిరణపాశమ్ములఁ దగిల్చి విరహిజనుల
దాని తీసెదు ప్రాణముల్ దోసకారి
రాజవా నీవు యమధర్మ రాజు గాని. 91

కం. తమ్ములకును గొడుకునకును
సమ్మతి గానట్టి రజని చరుఁడవు గావా
యిమ్మహి రావణదితిజుల
నమ్మక్కరొ మించి తేర యత్రికుమారా. 92

తే. గీ. గురుసతిని బట్టి విప్రయోగులను గొట్టి
తమ్ముల నడంచి పక్షపాతము ఘటించి
కాలగతి నుండి యిదె రాజ గట్టునుండి
పడె దధోగతి కారవ ప్రాప్తిఁ జెంది. 93

చ. తనుఁ గొనువారినిం గొనుచు ధర్మము దప్పక కాలకూటమున్
మును గళమం దడంచికొని మూర్ఖత నిశ్చరసావహింపఁ గాఁ
బునుక కళాస మెమ్మెను బూదియుఁ బూని తలేఱుఁ బట్టి యే
మను సగ మయ్యు మూలఁ బడె నుగ్రుఁ డుదగ్రనిశాచరాగ్రణీ. 94

వ. అని మదనునిం గూర్చి యిట్లనిరి. 95

తే. గీ. విసముతోఁ బుట్టెఁ గావున విధుని కకట
పద్మినుల నేచుగతి సరే ధళిరనీవు
పద్మినీపద్మనేత్రుల నలనఁబుట్టి
మేనమామను బోలఁగా మేలె మదన. 96

తే. గీ. తల్లిపుట్టింటిపగ వానిఁదనగఁ జేసి
తండ్రిపేరున గైకొన్న దంటకంటి
పద్మినీజాతులను జంప బగలుగఁటి
పౌర నీకిది యేమిటి పేరు మారు. 97

చ. అని యనిలుం గురించి పవనాశనవారియెడఁ జేయు నాయనా
ఘన మెడలించి మాతుగతిఁ గైకొనుచుఁ న్స్వమనోహరుండవై
దినమును ఉంకనుండి చను దంచుచుఁ గొమ్మఁ అల్మిఁ బట్టఁగా
వనఁ దగు దీవు రావణున కన్నవొ తమ్ముడవో యెఱుంగరా. 98

వ. అని శుకపికాదులం గురించి.

సీ. కానిమాటనె బంది ఖానసే కేయింతు
గడును కొక్కెరవేఁట కానిఁ గూడి
పట్టిమీపుట్టిల్లఁ బలు గాకులకొసంగి
వే ముంతు గోపికారామునఁ గూడి
పద మెత్తి పెట్టి మీ మదపెల్ల వదలింతు
మొదలనీ శుక నీల మేఘు గూడి
జడకొద్ది గొట్టి మీ చెడుగంతుల నణంతు
నిస్త్రులశరదబ్జనేత్రు గూడి

తే. గీ. యలిగి పెంగమేల నెఱజేయ శుకములార
విడఁ వుడీపట్టికూతలు పికములార
డించు డటు మందగతుల రాయంచలార
నిలుపుడిక వెత్రికేకలు నెమ్మిలార. 100

వ. విలపించుచుండు నవసరమున.

చ. చిలుకవశీరు ఛత్తరిని జిందఱ వాండఱ జేతునంచు నా
చిలుకల కొల్కిపై గదిసి చివ్వలిరవ్వలడంగ జాఱపెం

జిలుకలకోరికోల నటు చేసెను ముద్దులనారి ప్రేమతోగా
గలికి మెఱుంగుగుబ్బలను ఖంగు ఖణీలు ఖచిక్కు రింగనన్. 102

కం. ఇట్లేసిన మదిఝల్లని పట్లెల్లను సడలి రాధ భయమందుచు దా
నిల్లని పలుకఁ దొడంగెను బొట్టంబుగ జుట్టు నున్న పాలతులతోడన్. 103

ఉ. శౌరిని బిల్వగా జనిన చక్కనికీర మదేల రాదొ యే
దారిని జన్నదో నడుమ దారినో చేరనో లేదో గోపికా
జారుని గాన్చెనో కనదొ చక్కగ నాశకె విన్నవించెనో
సారెకు కేకి శౌరినుడి చక్కెరయారక్కెరి ముక్కు చిక్కెనో. 104

సీ. పద్మాక్షు డెవ్వతెపై గన్ను వేసెనో
పలుమాఱు వలకన్ను పదరె నిదిగో
శౌరి యెవ్వతెమోవి చవులను మరిగెనో
వదలక క్రొమ్మోవి యదరె నిదిగో
వనజారి యెచట నెవ్వతె చెట్ట బట్టెనో
విడువక భుజము కంపించె నిదిగో
ఫణిశాయి యెవతెను బైకొని యేలెనో
మించి పెందొడ చంచలించె నిదిగో

తే.గీ. చిత్తజానిత్రంద్రీ యెవతెదే జిక్కెకోనెనో మించుసందుమపైం తత్తరించె నిదిగో
చిలుక యీవేళగసుమరాక నిలిచినపుడె యేమిహేతువో తెలియ లేదింతులార.

కం. చెలువుడు వేఱొక చెలియను వలపున దలపోసినపుడె తనకుం బానే
తల నొచ్చు గనక వినుయె కలికికో యే మందు వలపు కానిదిసుమ్మీ. 106

చ. కిలకిల నవ్వుచుం దిరిగి కిన్నెర మీటుచు బాట పాడుచున్
జిలుగురుమాల చెంగు జెను జీ జీరగ ముప్పటొకింత జాఱగా
గలుకుహారంగు పెండియము ఘల్లున నాయొడ ఝల్లుఝల్లనన్
దులకుఱ శౌరి వచ్చుగతి దోచియు దోచకయున్నదే సఖీ. 107

సీ. మదహస్తిపై నెక్కి మాఱటీర్ గొలువంగ విచ్చలవిడిఁ జొచ్చి వచ్చినటుల
సాంద్రఛాటి తేజిపై సాహిణుల్వొగడంగఁ బట్టాను జేబట్టి వచ్చునటుల
వెంట దళంబులై విచ్చుకత్తులవారు మెచ్చఁగా ముందుఱ వచ్చునటుల
గిలుకుపావలు మెట్టి చెలికాండ్రు వెంటరాఁ బావురంబును బూని వచ్చునటుల

తే. గీ. బడఁతు లిరువంకఁ జెలనాకు మడుపులొసఁగఁ
గొనుచు జిగిచూపులను నాదు మనము గొనుచు
బడకయిలు సేరఁగా శౌరి వచ్చునటులఁ
దోఁచుచే కాని మఱి యేమి దోచలేదు.

చ. ఉరమున హారము ల్గదల నొ ట్లసియాడ ఘమాలు చెంగు జా
ర్నారని వటింపగాఁ జెమట లూరఁగఁ గస్తురిబొట్టు జాఱఁగా
వరుసలు మీఱఁగా గళరవం బొఱపారఁగ మందనుండి శ్రీ
హరి నను నేలె నేమ నెదు రానగ మా..గ నున్న దేమొకో- 109

చ. అరయఁగ బ్రాణనాయకుల నవ్వుల నిక్కులఁ బాయుర మ...
విరళరునంపతింపరల బ్రేగుచుఁ బొగ్గఁగ న్యాయ మక్కటా
హరి యిదొ నాదులోఁ బెలి న హార్నిశముం గనుపట్టుచుండె నీ
విరహ మదేలనో మిగుల వేదన బెట్టు దురాగతంబుగన్- 110

చ. వలచిన వారు లేరొ యెడఁ బాసినవారలు లేరొ వార లీ
యలమటఁ జెందిరే మిగుల నందియు నావలె జీవయుక్తలై
నిలిచిర యేటిమాట లివి నేరక యాడితి భూమి నుండగా
గలిగెను శౌరితోఁ జెలిమి గంధగజేంద్రసమానగామినీ- 111

చ. ఎంతవిలాస మెంతసొగ సెంతవదాన్యత యెంతరాజసం
బెంతయుదార మెంతకళ యెంతగభీరత యెంతసోయగం
బెంతనిరూఢ మెంతదయ మెంతవనోజ్ఞత యెంతరీపి నా
యంతటి మందభాగ్య కిక నంతటి చక్కని దేవుఁ డబ్బునే- 112

సీ. నేను ముద్దులు వెట్టఁ దానుముద్దులు వెట్టి తెలివ నీదుబుణంబు దీరె ననుచు
నేను గెమ్మోవానఁ దాను గెమ్మోవాని వలఁదిరో విందుకు విందె యనుచు
నేను జెక్కు నొక్కఁ దాను జెక్కు నొక్కి పిరిబోణి పీకకు పీడ యనుచు
నేను గౌఁగిటఁ జేర్పఁ దాను గౌఁగిటఁ జేర్చి మెలఁతరో మేరకు మేర యనుచు

తే గీ, రతుల నే నేలఁ దా నవరతుల నేలి సారసాక్షిరొ యిది మారు బేరమనుచు
చిన్ని చిన్నారి పెన్నుడు చేయు చిన్న లెన్ని యెన్నని తలపోతు నేమి సేతు. 113

సీ. కెమ్మోవి యానకు గెలిచేయుదురంటె గజిబిజి మొనపంట గంటి సేయుఁ
గురులు పట్టీడ్వకు గుట్టుదక్కదటంటె చీకాకు గాదని చిక్కుపఱచు
జిగిగుబ్బలంటకు సిగ్గుపోవునటంటె క్రొత్త నెత్తురు గమ్మ గోరు లుంచు
బరులు రాఁగలరు లేవకు గని నేలుచుటంటె జాముంతరబల్కు బ్రేమ నేలు

తే గీ. బలుక వల్లవఁ బావురా పలుకు పలుకు గిలకిలను నవ్వ గల్లవఁ గేళి వేయు
వానిఁ గ లెంచి మైనీరు గాని యపుడె రాజేఁ తపనో చెన చెవిధాత నన్ను. 114

సీ. వానికన్నుల తేట వాని చల్లనిమాట వాఁడాడు సయ్యాట వానిపాట
వాని ముద్దుమొగంబు వాని కంబుగళంబు వాని బొమ్ముదిటంబు వానిడంబు

వానివాతెరకావి వానిపెన్నెఱితావి వానిచక్కనికేవి వానియావి
వానిమూఁపుబొంకు వానిమేనిమెఱుంగు వానికౌను జెప్పంగు వానిరంగు
తే. గీ. వానిగొఱంతీరుచూపులు వానిసొరు వానివలపుల దొరసాము వానిగోము
వానిసేతళుకుగుమేల్మి వానితాల్మి పరుల కెవ్వరికిని లేదు మఱపురాదు. 115

సీ. తనర జూచినదృష్టి దాఁకునో యనివాని నను మోము కనులారఁగనఁగనైతి
గదియ నొక్కిన నేదఁ గందునో యనివాని యధరంబు తనివార వాననైతి
బిగికౌఁగిలెదసోఁక నొఁగులునో యనివానిఁ బ్రేమ్మున నిండార గ్రుమ్మనైతి
దడవుచేసిన మేను బడలునో యనివానిఁ జెలఁగి నామనసార గలియనైతి.
తే. గీ. నొచ్చు నంచని చెక్కిలి నొక్కనైతి నలుగునని గ్రుచ్చి కౌఁగిట నలమనైతి
నందనుత్ప్రేమ సరవుని నమ్మియుంటి నిప్పుడీరీతి నడుచునంచెఱుఁగనైతి. 116

సీ. మును కల్వ లొసగుచు మోమాటమున నున్న సోముఁడు సోముఁడై చురుకు చూపె
నపరశరీరుఁడై యాత్మజుఁడై యున్న మారుఁడే మారుఁడై పోరసాగె
దాక్షిణ్యశాలియై తగుప్రాణమై యున్న గాలియే గాలియై కలప సోకె
మధువుగూరుచు వేళ మహిమ నపేక్షించు సుగభియే సురభియై తరుమఁజొచ్చె
తే. గీ. నగ్నిశిఖలయ్యె విహరింప నగ్నిశిఖలు భువిశిలీముఖములు శిలీముఖములయ్యె
నన్నియట్లయ్యె నిట్లయిన నెపుడెయిపుడు కృష్ణదేవుని దయ దప్పె నేమి సేతు. 117

వ. ఇట్లు కుటంజేసి,

సీ. తగకుంకుమరసంబు మగని పేరురమునఁ బెంపొందు కొమ్మ కర్పించరమ్మ
పదనైనగంబురా పదయుపాతెగ పాసిరోయసఁగురంభోరుని కొసఁగరమ్మ
నాతిఁకస్తూరి గారాబుపతిపక్కి లయమ్ము గాత్రి కిప్పించరమ్మ
చేర్చి కూర్చినవిరుల్ చెలికానిఁ బైకొని పాసంగులతాతన్వి కొసఁగరమ్మ
తే. గీ. కటకటా నేర కిటులంటి గానఁ ద్రోహినైన నేఁ గూడగా బెట్టినట్టిదీని
నిచ్చినంతనె వారల మచ్చికలకు హానిపుట్టదె యిప్పుడే చానలార. 119

వ. అని యనేకవిధంబుల విలపించు సమయంబున,

తే. గీ. వారు నడుటికంటిమంటల నంటి బెదరి త్రుళ్ళి రౌతునఁ బడవైచి మళ్ళివచ్చు
తియ్యవిలుకానిసాంబ్రాణి తేజియనఁగ గగనమార్గంబునను దోచె గలికిచిలుక. 120

కం. ఇట్లు లేతెంచినచిలుకను గటిలాంక చూచి లేచి కులుకఁగ జిలుకా
యిటు రమ్ము రమ్మటంచన నిటమున మంజేతఁ ద్రావాలె దీసతదోపన్. 122

తే. గీ. అటుల మంజేతిపై వ్రాలిపట్టిముద్దు చిలుకను గురించి చిలుకలకొలికి పలికె
మోవి కంపించ మాక్కుర ముత్తెమదరఁ గప్పురపుతావి గుప్పునను ప్పతిల్ల. 123

సీ. కంటివా నాసామి కళలుగుల్కెడుమోము
కనులకఱవు దీర గరిమ చేర
వింటివా నాసామి వెలలేనిపలుకులు
తమకంబు దైవాఱఁ దాప మాఱ
నుంటివా నాసామి యొఱపైనమ్రంజేతఁ
గాయంబు చెలువాఱ ఘనతమీఱ
మంటివా నాసామి మన్ననల్ గైకొని
బలుసంతసము దేర వరపులార

తే గీ. నంటివా తుంటవిలుదంట మంటమారి
తనము తొగగంటి వెనువెంటఁ దగిలెనంట
తొంటి వెతరంట నొంటివె నింట నుంట
జంట గూడక తాళ లేనంట చిలుక. 124

చ. దేవకిచిన్నకుఱ్ఱ వసుదేవునికూన యశోదపట్టి నా
దేవుని వెందుఁ గందు బలదేవుని తమ్ముఁడు గోపగోపికా
జీవనజీవనంబు యదుసింహుఁడు శౌరి కిరీటిబావ శ్రీ
దేవియనుంగు సౌఖ్యవిరతి న్వహియింపఁగ గంటకీరమా. 125

తే. గీ. ఎంతవేడిన బదులాడవేమి చిలుక
కాలగతు లెట్లు లున్నవో గష్టచినామి
కాగలది కాకమానదు గాన దెల్పు
చల్లకైవచ్చి ముంత దాచంగ నేల.

తే గీ. అవిన విని చిల్క యాల్క పేరల్క చిల్కఁ
బల్కె నిట్లని చిల్కల కొల్కి తోడ
నన్ను దలమిన్న విను మొన్న నన్ను నీవు
వనజనాభుని దోడి తెమ్మనఁగఁ బోయి. 138

కం. తెలివారయె మని చెప్పెద
హారి యున్నవనంబు చేరి యటు చూతు గదా
గిరిగొని యున్నా రచ్చటఁ
దరుణులు కోటానకోట్లు తన్మధ్యమునన్. 128

సీ. బారను గొల్వగా మీఱువక్షమువాఁడు
తలచుట్టి వచ్చు నేత్రములవాఁడు
చెక్కునిపాల్గారు చెక్కులు గలవాఁడు
మెఱుఁగుచామనచాయ మేనివాఁడు

తే. గీ. చలువచప్పరకోళ్ళకుంచంబులోన
జెంపటిళ్లను కలగడల్ చిన్నదిండ్లు
బటువులౌలగులుఁ గల పూల పాన్పుమీఁద
దక్షిణమున నిళామాధవుల్ తగ వసించి. 138

సీ. కంసారి బిగియారఁ గౌఁగిటఁ జేర్చిన
గుబ్బలు కికిదీర గ్రుమ్మె గొమ్మ
కంజాక్షుఁ డాని చెక్కుల ముద్దు వెట్టిన
నలరుచెక్కుల మోవి యానెఁ జాన
యుతమని కన్నయ్య యుచ్చోట జెంకిన
దేటచెక్కిలిగోట మీటె బోటి
మందరనగధారి మణితముల్ నిలచిన
జిగురుమ కారముల్ చిలికెఁ గలికి
కృష్ణదేవుడు కరికర క్రీడసలుప
జేరితమి రేచి పురికొల్పెఁ గీరవాణి
నీలవర్ణుడు పైకొని క్రీడ నేల
బాలి సెదురొత్తు లిచ్చె నిళాలతాంగి. 139

సీ. కింకిణన్వ్ర్యలు గిలిగింతలును బంధ
భేదపూర్వములు వింతవగలు
పావురా పలుకులు వాతెరనొక్కులు
చిగురుమ కారముల్ జిలుగుచిట్లు
మురుమూపై రసములు తొందర ముద్దులు
ఓరిఁ గౌఁగిలింతలు బింకములును
గోనగోటిమీటులు గోరింపులొంబుకులు
కొసరులు బొమముళ్లు కుచుచవన్న
తే. గీ. తారకాబాహు మేలు బళారి బాగు
హాయితడబడ కెడ గాకు మాయి నాయి
విడకు విడువకు మనియెడి నుడువు లపుడు
చెల్లవో యేమిచెప్పుదు గొల్లకొల్ల.
తే. గీ. తెలిది యీరీతి వేవేలవితములమర
గలిసి కవిపాక నీలమేఘుంబుమీఁద
చెరితలుక్కను క్రొక్కారుమెఱుపనంగ
సరవిజాక్షుపై వేగఁ గేళించె. 141

తే. గీ. నిన్నగుప్పయు నేఁడొప్పు నలత, తాను
గోరి నామీఁద జేసినే కారుబారు
ముక్కుపచ్చలు మానక మునుపె బిరుదు
పిచ్చుక యెదిర్చి కాట్లాడ వచ్చినటుల. 8

తే. గీ. వెనుక గొప్పను మందలఁ జనులు గేలి
సేయునాయెను నా చింత జేయువింత
తాను కోఁదిన పొక్కిలు తనకు చేత
సన్నఁబడుసామ్య మాయెనో చిన్నచిలుక. 9

తే. గీ. తనకుమ ట్టెంత తా నెంత తాను యింత
చేయఁజాచిన నే నెంత సేయరాదు
కాలు చాచిన బోలంత విరివిగ్గైన
బోలువాచిన నది యెంత బోలు గాదు. 10

తే. గీ. వారిజాక్షిని నాపక వారివెంట
వనుప గోరంతయైనను మనసు లేదు
వందుడనుపఁగ గని మన మందునందు
కొంటి తడసేయరా దని యుంటిగాని. 11

ఆ. వె. కట్టచేలు కట్టుకున్న గుమ్మగబ్బాడి
తోసి రా జటంచుఁ జేసి చెలియ
దానిచేలుదీసి దానికవ్ పొడిచిన
యటులజేయకున్న నగునె చిలుక 12

ఆ. వె. తగరు కొండమీఁద దాఁక గోరినదారి
నెదురు దన్ను దెలియ కింతపలికె
నెంతమీను వచ్చి యెంతమీనును మ్రింగఁ
గాన ముల్లునెద్ది గంతమాయె. 13

సీ. అశుకవిత్వంబు లల్లితేనే సరా
చిత్రప్రబంధము ల్వ్రాయవలదె
గోటిచేతను వీణె మీటితేనే సరా
కొంచక రాల్గరఁగించవలదె
పదచాళిరాగము లాపితేనే సరా
హితవొప్పవర్ణంబు లెత్తవలదె
అలనాట్యభేదమ్ము లాడితేనే సరా
నవరసంబులవంటి నడువవలదె

తే గీ. వింతవింతగఁ గలిసిన యంతసరిగ
రమ్మొకాని మనోభావ మెఱుఁగ వలదె
రేమి పేరని నిన్నటియింత పెంటిక
మన్ను విడవాదరా కోరెఁ జిన్ని చిలుక. 14

తే గీ కాని పదరకు మిఁకమీఁద దాని మోము
గనఁగ వలదని కారినిగట్టిపెట్టి
వింకములుకూల వరకాళ బెట్టి నేల
రాచకున్నను నాపేరు రాధ గాదు.

కం. అన విని శుక మి ట్లనియెను
వనితా యేమందు దాని వగలో త్రుళ్ళో
మినుకో తెలివో గలివో
విను తెన్నకుఁ బండ్లు వచ్చు వితమాయె గదే. 16

తే గీ. చూపులోపల నొకవింత చూపు తళుకు
నడుపులోపల నొకవింత నడుపు బెళుకు
నుండు నునికికి నొకవింత నుండు కులుకు
వచ్చె గదవమ్మ మనయిలా వనిత కిపుడు.

తే. గీ. లేని పట్టింపులెల్లను బూని చాన
నేనె యెదురైన వింతైనఁ గాని చూడ
దల్పునకుఁ గల్మి వచ్చిన నర్ధరాత్రి
గొడుగు తెమ్మన్నకత గాను కోమలాంగి.

తే. గీ. పడఁతి మును దల్పనా పదిఁ బదిగ నేను
దాని వినయంపు పోకిళ్ళు తగ నెఱింగి
మానిసినిజేయ వలదమ్మ దీనిఁ జేర్చ
తెలియ నిది మేక వన్నెయ పులియటంచు. 19

వ. అనిన మధురవాణి యును మదుపవేణి యద్వ్యారిబోణి నవలోకించి యిట్లనియె.

కం. నీ వెన్నెఱుఁగవు తన్నెఱుఁగదు
తన్నుం దనము ట్టెఱుంగు దామోదరుఁడే
తన్నుండె నిన్ను విడుచు న
టన్న స్మృతి దీని నగరి వారాజనముల్. 21

కం. నిన్నుండే మానిని రై
నిన్నే కెలి సేయఁ బూని కెంత తళుకే

కొన్నంగడిలోపలనే
యన్నన్నా మాఱుబేర మగునే చెలియా. 22

ఆ. వె. ఈఁక తోఁక లేని శ్రీకృష్ణుమాటలు
పొలఁతి నమ్మి నానఁ బోకిరోనియై
దగిలెనా తగులును దప్పెనా తప్పును
నాతి కట్టివాని చేతిరాయి. 23

తే. గీ. కుమ్మరికి జాడ నొకయేడు గుదియకొక్క
పెట్టటన్నట్టు దీనియె బెట్టుతనము
తెల్ల నిదత్తిఱ నొకపారి ఇటకుకోరి
వచ్చి నిన్నేల నిందుకు వగవనేల
వ. అనిన విని రాధావధూరత్నం బిట్లనియె. 25

తే. గీ. కోటి మదనులఁగడవ్రేలి గోటగెలుచు
సుందరాకృతితోడ నా నందమిచ్చు
దివ్యసుందర గోపాలదేవు జూచి
వసుధలోపల వలకని వారు గలరె. 26

తే. గీ. దాని కెంతయు నన నేల తలచి చూడ
దప్పుతంటలఁ గొఱగాని దానివారి
ననవలెను గాని తెగ నిండ దోసముదీసి
యేయువాడేయ నమ్మోమి సేయు చిలుక. 27

ఆ. వె. నందసుతుఁడు మున్ను నామీది ప్రేమచే
నొకటి సేయబోయి యొకటి సేయ
అత్త కత్తిజేసె లంగడిలో గన్న
లాయె ననుచుఁ జెలి యఱసి నవ్వ. 28
వ. అని మఱియు నారాధావధూటి తన చేటీరత్నంబున కిట్లనియె. 29

ఆ. వె. తగులుదాఁక మీర మగపడ్డదాణముల్
గాఁగఁ జేసిపట్టి కాంతవింత
గట్టు చేవనంతఁ బుట్టినవానికి బొమ్మ
గట్టు సొమ్ముమాయెఁగద చెలియ.

సీ. కీరవాణులచేతఁ గీర్వాణ మంపితే
శిరసావహించు నో సరసిజాక్షి
నాతి యెవ్వతి యైన నామేర వేడితే
కనులెత్తిచేయు నో కంబుకంఠి
యెలమి నాకోసర మెంతవారల నైన
దగవాడఁ దలఁచు నో చిగురుబోడి
యే జాబి చూడక యేమాటజెప్పిన
జవదాట వెఱచు నో సన్నుతాంగి

తే. గీ. యేపదార్థంబు లైన నా యెదుట బెట్టి
కెవరికి నొసంగఁబోవఁడో యిందువదన
చేరి యిటు లున్నవిభుఁ డిట్లు చేసె నేని
తిరుగ బ్రతుకాడవలెనంటే శరదవేణి. 31

కం. మున్నెంతో చనవొప్పఁగ
మన్నించినవిభుఁడు నేఁడు మాన్యగ నైనన్
గన్నిటు బలిమిని వేఁడుక
విన్నదనం బదియె కాదె విభుఁడుం బాస్యా. 32

సీ. మేను మే నానిన మేను సోఁకదటంచుఁ
గలపంబు లొల్లఁడో కలువకంటి
పరులు దచ్చిన రిత్తపలుకు నయ్యా యని
తెర యెత్త నియ్యఁడో శరదవేణి
అలమి కౌఁగిటఁ జేర్చ నడ్డ మయ్యా యని
హారంబు లొల్లఁడో హంసగమన
గాసిల్లి నాతోడల్ కండె యయ్యా యని
కుంభాం మొల్లఁడో పువ్వుఁబోఁడి

తే. గీ. మణిగణంబుల దారిని వనఁగి పెనఁగి
కుసుమగంధంబులట్టులఁ గూడి మాడి
చెలఁగి తిలతైలమురీతిఁ గలసి మెలసి
యున్నవిభుఁ డెట్లు చేసెనో సన్నుతాంగి.

కం. అల్లునిమంచితనంబును
గొల్లనిరవికరము లేదు కోరితి నీరం
వల్లెను చూచియుఁ గనియును
బల్లములోఁ బడినదాని భంగిని జెలియా.

కం. సారెతన ముడి గింటింటికిఁ
దిరుగుచు బతిమాలు వారికిఁ దెలుపలు కలవా
తిరిపెం బెత్తెడువానికిఁ
బెరుగుంగా డేమి బ్రాఁతి విధుబింబముఖీ. 35

కం. కలలో నైనను బాయక
కలకాలము నున్న విభుఁడె కను గాయకు నై
పలచన చేసె నటన్నం
బెలియా మగవారి చనువు చెడ్డది సుమ్మీ. 36

కం. అను వనజాక్షిని గని తాఁ
గనికరమునఁ జిలుక పలికెఁ గానీ యమ్మా
వనజాక్షువింత లెఱుఁగవె
కవి తెల్పిన భారతంబు కథ లై పెరుఁగున్. 37

సీ. రానవాంక్షరోని దాని నసపోవి చెవకితే
కమఁగందునో యంచు గలవరించు
మెఱవల్లి మెల నెల్లి దనుమోనల్ సమిరితే
తగిలి నొచ్చునో యంచు గలవరించు
వదన మించుక నాభి పై మోపి ముద్దాడి
బరువాయెనో యంచు బలవరించు
గోటిచేగప్పు ముంగురులు చిక్కుడలించి
చురుకు సోఁకెనో యంచు బరితపించు

తే. గీ. జాజిపూదండ గొను తేటి జాడనమరి
తాను రతిచేసి దాని పాదమ్ములొత్తి
వలచు వారును వలపించు వారు లేరొ
వారలీబూమె లొనరింప లేరు గాని.

తే. గీ. దొరకరాని పదార్థంబు దొరికినటుల
తొమ్మునను కాని డించడే యిమ్మునైన
బెట్టుచోటను బెట్టక జలది నిపుడె
కట్టికాచుక యున్నాడు కదల నీయడు.

సీ. కనకాంగి కట్టు వర్గము బ్లైన టారొ
గొమ్మ పావడ చుట్టు కొనుట కాయొ
నలికెలి సొమ్ము మా నిలువుటద్దంబ బారొ
జెలిగోటిఱుక చిలక మారొ

దరుణిలేనులతోడ ల్తుడగడదిం డ్లాయె
కెందిఁగుబ్బలు చెంప బిళ్ళ లాయె
అలికాంగిచెమ్మట ల్పులుకపన్నీ రాయెఁ
గలికమోము నలుంగు కలప మాయె

తే గీ. కోటి పడకిల్లు జిగికొల్వు కూట మాయె
లోలలోచనతోడిదే లోకమాయె
బలుకులేటికి నిపుడిశా భామనుండి
యచట శౌరికి దొరతన మమరెనమ్మ. 40

తే గీ. మగువ యదిగాక యిఁకనొక్క మాటగలదు
వినుము కలపులదొరసాని యనెడు పేరు
దాని కిచ్చెను విను బిళ్వ బోనటంచు
నెటుల నోరాడె నో శౌరి చెలుఁగనమ్మ. 41

తే గీ. రాధలోనను నాలోన రమణి యెవతె
తెలుపుమాయంచు నానతో బలుక నాకిఁ
దన్నిటను మీర లొక్క రూపైనఁ గాని
మురిపెమున నీకె హెచ్చని మోహనాంగి. 42

వ. అని విని రాధావధూరత్నం బిట్లనియె. 43

ఉ. ఎల్లజగంబుల న్మనుచు నేలిక కంజభవాదివర్ణనీ హృ
త్పల్లసరోజరాజముఁ బూని వెలింగెడి తేజ మిందిరా
వల్లకపాణిబాహువుల కబ్బని దివ్యసుఖంబు చిత్ర మీ
పల్లవ కామినీచరణ వారిజసేవకు లెస్స జక్కగా. 44

తే గీ. వారి వీరిని వన నేల వీరివారి
గంగలపు నేయుడ వ్వన వలయు గాక
తెలుఁగెఱుఁగక యపుడట్లు దిమ్మగొంటి
తలపఁ దననుండి రానట్టి తప్పుగలదె. 45

తే గీ. ఎల్లవారికి శకునంబు తెల్లఁ బలికి
బల్లి తాబోయి తొట్టిలో బడినరీతి
నొకరి వననేలఁ బెసికొనినపలికి
కాసుక జింతించు టెల్లను కత్రితనము 46

ఆ. వె. పొద్దుముద్దుమాటి యామని మగఁడంచు
గూడి మాడి కూడ జాణనంచి
బలిమి విందుబెట్టి పగగొన్నచందాన
కెండ్లి చేసి నేని చేలచెలి.

మ. చిలుకా యెవ్వతె లేనిమోవి లిడి డా చేతం గడం ద్రోయునో
బలిమిన్ రాధికదూతి గా జె యని కో పాటోతతం జూచునో
వలి యాకంటికి ఖండ చక్కెరలభావం బుంచునో యుంచదో
కలలో నంతకు తాకలే వకట నీ గారాబ మెట్లున్నదో.

సీ. ఏసాంక వాకోద యిఁక రాపు సేయునో
చూడఁ జాలక రాజ శుకములార
అంబుదాలకయేది యలజళ్ళ బెట్టునో
సైరింప లేక హంసంబులార
శరదిందుముఖ యేది విరసంబు చేయునో
నెమ్మి నెమ్మది మాది నెమ్ములార
మించుబోణియెవర్తు మిఱుమిట్లు గొల్పునో
వైరంబు మీఱగోర్వంకలార

తే. గీ. తేజరిల్లుని శాండజ రాటయావ
కాలరాచును మిమునెల్ల నేల చెట్టి
మిగుల మునురీతి నావెక్క సెగిరి పడగ
వలదు మను డింక సన్మార్గ వర్తులగుచు.

తే. గీ. కలరవములార యిఁక నొక్క కలికిమిమ్ము
దప్పులెంచక యోఁకలి దప్పు లెఱిగి
పనగ లుఅవలు పువ్వులు సన్నబియ్య
మునిచి పెంచునొ పెంచదో కనరు చేసి.

వ. అని పెచ్చెలులం జూచి యిట్లనియె.

సీ. హారిమధ్య యెవ్వతె కరిగోలబెట్టునో
యదలించి మత్తేభ యానలార
కవకాంగి యెవ్వతె కడుగాఁకఁ జూపునో
విడివడి సమదాళి వేణులార
శుకవాణి యెవ్వతె వికసించి పలుకునో
వెంగ మెత్తిచేసి యేరా ముగుదలార
అబ్జాస్య యెవ్వతె యఱగోఁటల్ నించునో
పక్షపాతము బద్మాక్షులార

తే గీ. యింక నేకలకంఠి తా సెగిరి పడునొ
పగను మీమీద బల్లవపాణులార
మీరుకలనైన నను బాసి పోరటంచు
నిమ్ము యుండిరి నిదివఱ కమ్మలార.

తే. గీ. ఒక్కపాటు నెఱుంగక యున్నమీకు
వకట నన్నుండి యీవేళ నందఱకును
నినుమాతోఁగూడనగ్నిహోత్రునకు బెట్టు
తగులు వంచనుకత గాను తరుణులార.

సీ. ఈమేను దొరఁగిన నిఁక జేవునకు నేతె
వరతను వబ్బదన్ భ్రమను గాదు
పద్మాక్షుఁ డీవట్టి పడకిల్లు గన్గొని
పరితాపమందు సంభ్రమను గాదు
మనరాధ పోయెఁ గా యని యిలోకులింత
వగలందునో యను భ్రమను
చుట్టువాఱఁ బెట్టు చుట్టంపు పూబోండ్లు
పలవిఁ తురో యను భ్రమను గాదు

తే. గీ. మంచి యొలిక పాని లేదంచు మీఱి
తెగ్గుచెందెద రనుచు నేనివ్వి నాళ్లు
నిలుపఁగూడని ప్రాణముల్ నిలుపుకొంటి
నిఁక నిలుపరాదు దయచూపుంచు డింతులార. 71

వ. అని విలపించుచుండు సమయంబున. 72

కం. మరు డురవక్షి నొఱ వవిరి
కిరుస ఝురీలంచు దూసి కినిసి విరానన్
పరు వెంట వెమట వాడమగ
దరుణీమణియెదను దారి దప్పక కుమ్మెన్. 73

కం. తనువెల్ల జల్లు మనగా
ననమోవి చలింప మిగుల నకుము వణంకం
జను లదరిఁ గురులు వదలఁగఁ
గనుదమ్ముల మోక్షి వ్రాలెఁ గామినిమూర్ఛన్. 74

కం. అత్తరు బిస్తరు లెల్లను
జిత్తమ్ములు తల్లడిల్లఁ జిత్తజుఁ జూచిపురన్
గత్తులపై వ్రాలిన యా
దృత్త చకోరాక్షిఁ జూచి మమతఁ దలిర్పన్. 75

సీ. కలకంఠి నిట్టూర్పు గాడ్పులు నిడిన
వల్లీమతల్లిక లెల్ల సొరిగె
మదవత్తపై సోకు మారుత మొలసిన
శుకపికనికరము లొసలి వ్రాలె
నలివేణి యొరిఁగిన తలిరుటాకుల సెజ్జ
నీరసం బైబూది దారిగాంచె

దరుణిగుబ్బల నున్న తారహారంబులు
సొబగెల్ల జెడి చిట్లి నున్నమయ్యె
తే గీ. దమ్మిలిడబోపఁ గలువ పొత్తములయ్యె
విసము లయ్యెను జేర్చిన బిసములన్ని
మల్లెలయ్యెను విరిబోండు మల్లెలుంచ
కెందమను వీకఁ జెడు దీవిఁ జెందు కాక. 76

కం. ఏ మంద మేమి సేయుద
మేమందునఁ దీరఁ గాక లేదిక మకటా
యేమందయాన నడుగుద
మీమందరకుచ తెఱంగు లెల్లనటంచున్. 77

సీ. తావిక ప్రపుదిన్నె దనరించె నొకరంభ
యుప్పుపప్పొడి గప్పె నొక్కశ్యామ
విరిజాజులలరించె వేఱొక్క లతకూన
యొమ్మతమ్ములనుంచె నొక్క సరసి
బిసకాండములఁ జేర్చె జెస నొక్క పద్మిని
యొగిఁ బల్లవములనుంచె నొక్క కొమ్మ
హిమజలంబుల జల్లె నింతొక్క శశిరేఖ
కందొగలిడె నొక్క కృష్ణవేణి
తే గీ. తక్కు నెచ్చెలు లట్లనే తలిరువిల్తు
ధాటి కోర్వనిరాధావధూటి కపుడు
తమతమకు నొద్దికైన సాధనములొసగి
సారెఁజేసిరి శైత్యోపచారవిధులు.

ఉ. కోమలినిబ్బెపువ్వులుదగుబ్బల బొబ్బిలినొప్పుక ప్రమా
కాముని కాఁక సోకి యది గప్పున మందదొవంగ మన్మథ
స్వామికి నే డిదే చమురు వత్తియు లేనివాలిజోతు లో
సామజయాపర యని చారలు చేతులుపట్టి పల్కఁగన్. 79

తే గీ. సకియ లిటు సల్పు శైత్యోపచారవిధులు
చెలియ కవి నిమ్మ కెరవు చేసినవితానఁ
గాఁక మిక్కి మించగా నది గాంచి మధుర
వాణి యనుచాన మన్మథస్వామి గాంచి

సీ. రతిమనఃకాంతాయ రాజీవకుంతాయ
మలయానిలరథాయ మన్మథాయ
సత్కీరవాహాయ జగదేకమోహాయ
మత్తకూర్పతథాయ మన్మథాయ
పద్మాకుమారాయ బాలికాధారాయ
మహనీయవిబుధాయ మన్మథాయ
మాధవప్రభవాయ మాధవసచివాయ
మానితాత్మకథాయ మన్మథాయ
మంజుహర్షణబోధాయ మన్మథాయ
మధుపగుణ చాపనాథాయ మన్మథాయ
మహిత శృంగారసదనాయ మన్మథాయ
మనసిజాయ తుభ్యం నమో మన్మథాయ.

కం. నగధరుఁ డెప్పటివలెఁ జెలి
తగులొందిన నిన్ను యిష్ట దైవము వంచున్
దగఁ గొలుచుఁ బాపు మాపద
ఖగవాహన గోపతనయ కమలాదరణా. 82

తే గీ. అనుచు బ్రార్థించి వందనం బాచరించి
మృగము చేత గేదంగి రేకుపైఁ ద
దీయయంత్రంబు వ్రాసి రాధిక ముదాని
యాక్షణమె దిట్టముగఁ గేల రక్షగట్టె. 83

కం. ప్రియు నామమ్ముల పలుకులు
ప్రియ మందఁగ నాలకించి పెంపు దలిర్పన్
నయనములు దెరచి సరసిజ
నయనుని నటఁ గాన కడలి నాటిన ప్రేమన్. 84

శా. ఆకాంతామణి యంగజానలము లోకాతీత మై సర్వ నా
లోకాభీలదృగశ్రు వర్షము లురూరోజాద్రులం గుప్పఁగా
శోకోద్రేకముచేఁ జెలంగు వెలఁగ మున్సోకించి తా నేడ్చె న
స్తోకోన్మత్తమయూరరాజ విలసత్పర్యక్త రావంబునన్. 85

కం. వనజాతవదన అది గని
వనితామణి చుట్టుముట్టి వగవకు మమ్మా
వనమాలిఁ గూడె దిదిగో
వినుమా దక్షిణపుగాలి విశదం బయ్యెన్ 86

పోయిన బోవకున్న నిలఁ బుణ్యమొ పాపమొ గ్రుద్ధికన్న దా
మూయక విచ్చినన్మఱచి మూసిననేమి తలంచిచూడగన్. 91

కం. ఐతే యింకొక సెంజలి
యాతరుణీ స్నేహవిమోహము నవలోకింపం
బాలకురాలైతిగదా
యీతరినను గూర్చి పగవనేటికి మీకున్. 92

కం. అని పలుకు వనిత గనుగొని
కనకాంగులు కనుల నశ్రుకణములు దొరఁగన్
వనరగ నేటికి నేటికి
వనజాక్షుడు వచ్చువేళ వచ్చెనటంచున్. 93

సీ. హరి యదె కెంచేసి వరరథాంగస్ఫూర్తి
యను వంద వీక్షించు మనియె నొకతె
కమలాప్తుఁ డదె యీ మొగం బయ్యెఁ బద్మినీ
హాసముల్ చెలరేగ ననియె నొకతె
గోవర్ధనుడు తమఃప్రారప్రవాళజాల
నల్లదె పొడమూపె ననియె నొకతె
యదె లోకబాంధవుం డరుదెంచె గుముదాళు
లణగి తల వ్యాంప ననియె నొకతె

తే. గీ. కరుణఁగొన్నుఁడు నీమీద గన్నదెలిచె
నదిగో దిశలెల్లఁ దెలివొందెననియె నొకతె
వచ్చె నాచాయ వగ కాదుఁ వగవబోకు
మతనుధను మేమిసేయుదం చనియె నొకతె. 94

కం. ఈరీతి వారిపలుకులు
పారకు వీనులను సోక సతి మరు కాకల్
దీరగ నెలదుంకడ నా
కారిం గోరుచు నటుండె సమ్మతి మతియై. 56

తే. గీ. అంత నచ్చట నర్జునాప్త్వయోని సఖుని
జేరి రాధిక పంచిన చిలుక యలుక
చెప్పకయె పోయె నని చెప్ప చిత్తగించి
వనజనాభుడు మనముఁ దిగ్గనఁగ లేచి,

సీ. రాజాస్య గిలించు రవల పాపట మాని
ధవళాక్షి యిచ్చుకై దండ మాని
పడఁతులు దెచ్చిన శారిపల్లకి మాని
సుముగంధు లిడుచామరములు మాని
కాంచనాంగులు పట్టు కరదీపికలు మాని

శుకవాణులను హెచ్చరికలుఁ మాని
భామామణుల లాసంగు భాగమ్ములను మాని
వనితలు విసరు పావడలు మాని

తే. గీ. బాలశిఖిపీడ నరవిరి సరులు వాడ
బెట్టువగతోడ హృదయంబు కొట్టుకాడ
విరహ కెంపనగూడ ముత్యాల పేరులాడ
జనియె నా ప్రౌఢ శృంగారవనముజాడ.

వ. ఇట్లు చని. 98

కం. చైత్రరథనందనాదిక
చిత్రమనోహృద్యమైన శృంగారవనిన్
మిత్రులతో రాధా శుభ
గాత్రిస్మృతి దలంచి గరుడగమనుఁడు వెదకెన్. 99

సీ. ఎలనాగ నాచెంత కింతెంత వచియించె
తనముద్దు చిలుకనుబలిచెనో కో
వచ్చియిచ్చట నాదువర్తమానము చూచి
పోయినశుక మేమి పొల్లైనో కో
రమణాక్షి యదివిని యానినపులిబోలెఁ
బదరి భగ్గునమండిపడి యెనో కో
యలిగియొక్క నెపముగా నళినలుపగ దాటి
మించగా నేమి శోధించిరో కో
తోయజాననమది కేమి తోచెనో కో
దైవమెగలి జేయంగ దలచెనో కో
కాల శని యొంటెనో జవరాలి బాసి
యేల వచ్చితి నాబుద్ధి కూలిపోను 100

ఉ. కామిని చిక్కఁ పోయెఁ బలు కవ్విని గుండెగబీలు వంచనన్
మోహముకయింత చేసికొని మోవివడంకగ మూనవాడఁగా
గామని కాకలఁగుమిలి కంటికి బుట్టెడు నీరునించి తా
నే మనిమెంచెనో మదిని కింతఫించెనో యేమి చేసెనో. 101

సీ. నినుఁబాసి నిమిసంబు నిలువజాల నటంచు
గాఁగిటఁజేర్చుక గడియసేపు
నీ వెంట నేవత్తు నేఁ బాళ లేనంచు
కరములు పట్టుక గడియసేపు
ననుఁబిల్వ బంపుమా నాయాన నీకంచు
కన్నీరునించుచు గడియసేపు
దానిమాయల జిక్కి దయవీడకుమటంచుఁ
గదిసి బొమ్మనవ్రాలి గడియసేపు

తే. గీ. గాఁగవగచుచు గద్గద కంఠయగుచు
బ్రేమమీరంగ దీవెన వీడెమిచ్చి
పనుపజాలక పైనంబు పనిచినట్టి
యువిదనెడబాసి యుండుటుచితమగునె. 102.

సీ. చూతునా యొకసారి శుకవాణి నెమ్మోము
కలువరాయని గాంచు కఱకదీర
విందునా యొకసారి విరిబోణిపలుకుల
కలికి ధ్వని విన్న యలుకదీర
చేర్తునా యొకసారి చెలిమేనుతో మేను
పూవానుపైనున్న తాపమాఱ
దొరకునా యొకసారి తెఱవచన్గవయంట
దమ్మి మొగ్గలనంటు తలఁకుదీర

తే. గీ. కలుగునా యొక్కసారి చక్కనిమిటారి
ముద్దుచెక్కిలి ప్రేమతో మూర్కొనంగ
గోవబుక ప్రపుఁబలుకు మూర్కొన్నయట్టి
కాకదీరంగ నంతరంగము చెలంగ.

చ. అలవనిజాంఘ్రిపద్మయుల లత్తుక నాముని కాళ్ళ సోకఁగా
నిలిచి తమిం దొడల్తాడలు నీవియు నీవియు నాఖిలాభియున్
వల నగుబొమ్మబొమ్మజిగి నాతెర నాతెర మోము మోమునుం
గలియఁగ విందు కౌగిటను గ్రమ్మక నెమ్మి చెలంగు టెన్నడో.

సీ. శృంగారయాపన శ్రీరాధివదుమను
దనతారు బంగారు తమ్మియనఁగ
దళుకుమించన మించు దనుచంద్రరేఖలోఁ
బరిఢవిల్లుకరంగ పదమనఁగ

గలదు లేదనునట్టి కౌను దీవియ యందు
బూచిన దింటెన పూ వనంగ
వలు వొందు నాభిపు ష్పాగంబునను బుట్టి
ప్రవహించువిరి తేనె వాకయనగ
తే. గీ. జొక్కు మరు లెక్కు మెత్తలఁ జుట్టి చూడ
వజాఁ డొవర్చినమోహన యంత్రమనగ
మరులు గొలిపెడు దొరసాని మరునియిల్లు
కళలు గరగంగ ముద్దాడి కలియు టెపుడొ. 105

చ. పయనము పోయివచ్చెదిరు వారపుముచ్చట లావలన్ మఱెం
తయు నిను గూడు ప్రోడలకుఁ దప్పక చెప్పుమునాదుప్రాణనా
పయనము గానిబుద్ధియని పల్కుమటంచును రేవ వ్రాలి హా!
దయ పగవారికైన నమితంబుగఁ గా దనుచావనెన్నుదున్. 106

చ. వెంగ వెంకయింతజేసుకొని మోవి చలింపగ మేను సోలఁగా
జిగివనులందు నీరొలక జిత్తజుగేహము చెమ్మగిల్లఁగా
రగ దలవాకిట న్నిలిచి మాన్పడి నే నిటు వచ్చువేళలన్
సొగసుం జూచి నానుదతి చూపుదలంచిన నోర్వశక్యమే. 107

సీ. శయనింప నొల్లదు శయ్యపైనైనను
వనజాక్షి నాయురంబున నె కాని
వసియింపనొల్లదు పసిడి గద్దియనైన
ఘనవేణి నాయంకమున నె కాని
భుజియింపనొల్లదు పులిజున్నునైనను
దెలిక నాకెమ్మోవి తేనె గాని
వినఁగ నొల్లదు రుద్రవీణారవంబైన
గలికి నా గళరవంబుల నె కాని
గీ. పిలువనొల్లదు తనతోడి చెలులనైన
గన్నియల మిన్న ప్రేమతో నన్నె గాని
అట్టిగుణరాశి నెడబాసి యట్టిగాని
పొందుచేసె విధాతదుర్బుద్ధి చేత.

సీ. మదుపుల మార్పుల మక్కువలొనరించి
కమలపు మార్పుల దంటఘటించి
నెమ్మోము మార్పుల నెమ్మది సవరించి
వాతెర మార్పుల వలపు పెంచి
బిగితొడ మార్పుల సొగసెంతొ తనరించి
కౌఁగిట మార్పుల గనువమించి
తగు తల మార్పుల దమకంబు పుట్టించి
ప్రక్క మార్పుల చేత భ్రమఘటించి

తే. గీ. పొలయలుక నించి వెంటనే బుజ్జగించి
కళలు గరగించి మనసార గారవించి
రతుల సొక్కించి వన్నెలు రమణి నెంచి
జాలిగొనిచాల యీవేళ తాళజాల.

చ. కులుకుచు గల్లుమెనిలిచి గుబ్బలచాడఁగ గొప్పు వీడఁగా
దిలకము జాఱి రెప్ప లరతేలఁగ నూర్పులుమీఱ మారునిల్
జిలజిల మంచు జెమ్మగిల జెక్కుల చెమ్మటలూర హాయిగా
దలపడి చేయుపుంరతిని ధ్యానము చేసెద నెప్పుడు స్మదిన్. 110

చ. పడకకడునున్ దొడల్ వదలు పావడవాతెరపాటు చెమ్మటల్
సడలిన పెన్నెరుల్ కరఁగి జాఱినచాదిక చిట్టుగంధమున్
బెడిదపు టూర్పులుకి కులుకు పెన్నుగుబ్బలపచ్చిగోరులుం
దడబడు యాలమున్ వలపు తందరయుగంద మారుసాధవన్
బడలి సుఖద్రవం బొలుక బ్రక్కను నిల్చు చెలిం దలంచెదన్.

సీ. జంకించుచు నదల్చి సామిరమ్మని పిల్చి
యెదరానుకొని నిల్పు సుదుటు దనము
జిగుగుబ్బలను గ్రుమ్మి బిగికౌఁగిటను గ్రుమ్మి
మనసార దనువమ్మ్రు మంచితనము
ఒడికట్టు సడలించి తొడతొడగదియించి
బెట్టుగా దమినిందు దిట్టతనము
జిలుఁగుపిట్టులుదిట్టి యలిగి చెక్కిలిగొట్టి
వలపుముద్దులు పెట్టు సొలుపుఁదనము

తే. గీ. మ్రొక్క మ్రొక్కించుకొనునట్టి చక్కఁదనము
పొగడి పొగడించుకొనునట్టి ప్రోడతనము
దక్క దక్కించుకొనునట్టి దంటతనము
దానికే కాక కలదె యేచానకైన.

తే. మనుప్రసిద్ధుర లేదయ్యె ముదిత నెనసి
కనుల నిద్దుర లేదయ్యె కలదిబాసి
యేమి చెప్పుదు మన్మథస్వామిమాయ
ముంచక యెముంచె నెంచగ యుంచె నౌర.

సీ. సొగసులపుట్టిల్లు సొక్కుమందురదీవి
రాజసమ్ముల టెంకి రామచిలుక
నెరవన్నె బంగారు విరవాదివిరితీగ
కుసుమాస్త్రుచేదక్కు కులుకులగని
మరునిశాస్త్రపుటీకబులుపుపీటము పులి
గడిగినముత్తెంబు కమలపాణి
మదనసమ్మోహన మార్గణ మక్కల్కి
మరులుగొల్పుటకిమ్ము పంచిపొమ్ము

తే. తతసుగుణపేటి దివ్యసౌందర్యవాటి
కవితలకు మేటి మాధుర్యవచనధాటి
భావజునిగోటి ముద్దురాధావధూటి
గాన మిల నేటివఱలోన దానిసాటి.

ఉ. మారునికేళిలోఁ జెలఁగు మాసెనటంచును మాటుకేగనే
పారకుఁబోవు నిల్వుమని జాలుపయంట చెఱఁగుపట్టినన్
మీఱినసిగ్గునారజము మించినచూపులు చిన్నవ్వుల
వ్వారిగ గుల్కుకల్కి తలపంచిన దొక్కటి కోటిసేయదే. 122

ఉ. కన్నులజెక్కులన్ మడచు గర్నయుగమ్మున గాయుగీమున
జన్నులవీడె మెవ్వరిది చక్కని బొమ్మ విదిక్రమించ నెన్
జెన్ని శిరంబువంచి ననసిగ్గుముడం బరనవ్వమీఱఁ దా
దిన్నగఁ మోముఁజూచి నగిత్రిప్పి మఱెవ్వరిదన్న దెన్నదన్.

సీ. కాంచనకాంచికా ఘనఘనప్రభల్
హెచ్చగానెదురొత్తులిచ్చియిచ్చి
రతనాలకుతికంటు రంగులీనగమీఱి
పారావతధ్వను ల్పలికి పలికి
ముంగరముత్యంబు ముద్దుగుల్కగజేరి
యొనరికె మ్మోవి యొసఁగి యొసఁగి
తారహారమ్ములు తీరొందగ బెలంగి
గుబ్బలచే లొమ్ము గ్రుమ్మిగ్రుమ్మి

తే. సగము మొగిచిన కనుగవ సగము నగవు
సగము సగ ముగుపలుకులు సగము మురుపు
కలిమి సగముసు దగరతి గలసి యలసి
లోలలోచన నాయెడ వ్రాలు టెప్పుడో.

ఉ. నిదురించు జాలు లెమ్మనిన నే శయనింపగ గల్కి యల్క చే
బదరుచు లేచి యవ్వలను బైట చెదంగిడి పవ్వళింప నే
బదము లొత్తి దన్నినట వల్మిని నే గలయంగ శయ్యపై
వదలిన కీలుబొమ్మవలె వ్రాలిన దప్పటి దిప్పుడైతగన్. 124

సీ. ముద్దుపెట్టగవద్దు ముదిత! యెంగిలటన్న
మోమునసి చెక్కిలిగొట్టి మోవి నొక్కు
సుద్దిగ నువ్వాను సుదతి ముట్టకుమన్న
గబ్బిగుబ్బలఁ గ్రుమ్మి కౌగలించు
నబల! పైబడకు మర్యాద గాదన్నచో
గదిసి పెన్నెరపట్టి కదిమి తిట్టు
వ్రతము నేటికి బ్రక్క నతివ! పండకుమన్న
బైకొని కేళి కుపక్రమించు

తే. గీ. మేలుగని మెచ్చువా తెర గోలనిచ్చు
ముద్దుగొనవచ్చు సుద్దుల బ్రొద్దుపుచ్చు
రమ్య మగుగచ్చులిడి పురారతుల హెచ్చు
నట్టి చెలిపొందు గాంచకే నెట్టులుందు. 126

సీ. అంగజజ్వరతాప మాఱదు సఖిముఖ
పూర్ణచంద్రోదయంబునను గాని
మదనవిదాహంబు మానదు వరబోణి
మోవిపంచామృతంబునను గాని
స్మరదోషమాఱదు సతిమృగంధవసంత
కుసుమాకరంబు గైకొనిన గాని
మన్మథకార్యంబు మానదు జవరాలి
నిటలరాజమ్ము గాంచక నియతిగాని

తే. తలఁప వలరాచభూతంబు దలఁగి పోదు
ఘనఘనకచాకటాంజనంబున నె కాని
యెట్లు వేగింతు నేరీతి నేసహింతు
నెవ్వరిని బంతు గాంత పొందెపుడు గాంతు. 127

చ. మదనుని కేళిచేసెనని మంచముడిగ్గి విలోలగాత్రియై
పదరఁగ జూచి నేఁ గరముపట్టి పునారతి కచ్చరించినన్
వదలిననీవితో శిరము వంచి నిశాదరహాస మొప్పఁగా
మదనునియిల్ తళుక్కుమన మక్కువఁ బైకొను కన్నె నెన్నదన్.

సీ. అయ్యొ వచ్చెనటంచు దొయ్యలు లెఱిఁగింప
బదరి దిగ్గున లేచి యెదురుకొనును
చెలిమి నన్నిను మంత సేపు చూడక యున్న
నావఁ ద్రావినజోక నటవటిల్లు
నెడ నేది విన్నవానుడియెలుంగో యంచు
నెరిబొమ్మనిక్కమై మఱచివినును
పౌరుషరతి నేలి బడలితివో యని
వలిపె చెంగావి పావడను విసరు

తే. నేను సంతోషముననున్న నెంతొ చెలగు
నింత నే విన్ననై యున్న వంతజెందు
నట్టి ప్రియురాలి నెడబాసి నట్టిరవకు
జెన్నలిని గావు మందర మున్నవింక.

సీ. చుక్కలగమి కాదు సూర్యుడై యుండునా
చెలిమోముతో మోము జేర్చియున్న
విరుల సరమ్ములు శరములై యుండునా
మెలతకన్ సన్నల మెలగుచున్న
పలుకలపలుకులు ములుకులై యుండునా
నిరిబోణిమాటలు వినుచునున్న
చిగురంకుతల్పముల్ చిచ్చులైయుండునా
చేడియపదసేవ జేయుచున్న

తే. మలయమారుత మెంచైన మంటలౌనె
బిసరుహాక్షికి సురటిచే విసరుచున్న
మదిమదిని నేనెకానినట్టి కాదవలనఁ
సారెపేరఁ బయులను దూఱనేల.

సీ. కుచకుంభముల మీఁద గోరంకుశంబాని
కలకలయుక్కున నతికిపట్టి
కష్టుపుప్పొడిలోన దుమ్మురం బాడించి
చలువగొజ్జంగినీటఁ జల్లుకొలిపి
మచ్చికమాటల మెచ్చుచు లాలించి
ననసెజ్జ సజ్జారమునను జేర్చి

మరులుకొల్పెడిసంకు మదత్రైల మెనయించి
తాఁబూలమును కబళంబు మేపి

తే. గీ. చిరచిరగ నొక్కి మర్మముల్ దవ్వులనొక్కి
దురుసుపై సరసముల నెంతో దనముజూపి
నెయ్యమలరార మబ్బుడట్టియ్యకున్న
మనసునహుపారు చెంద దా మరునిదంతి

ఉ. ఎవ్వరికూటము ల్చెలిచి యెవ్వరిమున్నెడబాసినా మొ నే
డివ్వగ రవ్వలంది యిపుడిద్దఱ మిద్దఱ పై విదేశత
న్నొక్కక నొచ్చి మోహమను నూతమునింగి సుఖంబు లేక
జవ్వన మెల్లబో గడపి చావట నేనిటు దల్లడిల్లగన్. 131

సీ. హృదయేశ విను బాసి యేఁ దాళజాలరా
జాములో వత్తువో జాగులేక
జీవితేశ్వరపోయె నీవింక రా మఱి
జాములు రెండాయె నైచలేను
ప్రాణనాయక బదుల్పలుకవదేలరా
జాములు మూడాయె సాగిరాను
నామనోహరమల్లివను జేరియేలఁగా
జాములు నాల్గాయె సహజముగను

తే. గీ. అని బహుదినాల పైపాన కాడిగద్ద
దస్వరంబున నెదజేరి తానుబనుప
రాలు కన్నీటి యేఱుల లీల దాటి
వచ్చినప్పటికేటికి కీ వంతలకట 132

సీ. పికిలి పిట్టిలదారి బిగికౌగిలుల జేరి
పెదవులు గఱచుక పెనఁగి పెనఁగి
మల్లవల్లభులట్ల మరుసాదవలపట్ల
గల్లమ్ములకు వచ్చి కలిసి కలిసి
బిరు దొందుమాష్టీల కరణి నిర్వారమును
జాఱుకుపైసరములఁ జూపి చూపి
మత్తేభములవీఁక మఱయుచు నెడమాక
తమకముల్ గిరికొన దాఁకి తాఁకి

తే గీ. చెలఁగి లకదారులను హెచ్చి పకిలి పకిలి
కాదమచిలువల చెలువునఁ గదిసి కదిసి

మానవరుపార వెనుతీర మీదువారి
చేరి గడిదేరి సరిపారి మీఱు వెఱ్ఱి. 133

ఆ. వె. వాలుమీల నేలు వాలుఁగన్నుఁ దాలు
సోముసోము నోము మోము గోము
మాపు రేపు తూపు రూపు మాపు నుజూపు
కన్నె సన్నె నన్ను మిన్న నున్న. 134

సీ. కర్పూరంపుదీవిన గలుకు చెంగావిని
దావిచే మోవిచే దోవ నెంచి
యొంటి దేఁటి బారును దలిరాకు సౌరును
నారుచే గోరుచే దూఱు లెంచి
విరచాబ్జనములను విమలాద్రిమణులను
గనుటచేఁ జనుటచే ఘన మడంచి
యద్దంపు టెక్కుల మేలు రాజానిక్కుల
జెక్కుచే ముక్కుచే జక్కడంచి

తే గీ మురువలరు కొమ్మ వలపుల ముద్దుగుమ్మ
కమ్మసంపంగి కొమ్మ బంగారుబొమ్మ
యలచుగొజ్జంగి తెమ్మ మర్వంపు రెమ్మ
నెపుడు గన నేర్తు నందాక నెట్టులోర్తు. 135

కం. నాగముల నేలుఁ గుచములు
నాగంబుల నేలు నడలు నాభిబిలము పు
న్నాగముల నేలు నవుచో
నాగశ్రియు నేలు టరుదె దలంపన్. 136

తే గీ. చాన మోమంద మెల్ల లోచనమయంబు
కొమ్మ బొమ్మంద మెల్లను గుచమయంబు
కలికి చన్నంద మెల్లను గటిమయంబు
గావ దానికి సాటి జగానగాన. 137

సీ॥ జలజాక్షి లావణ్య సరసి గా కున్నచో
జనుదమ్మి మొగ్గ లం దొనరనేల
నవశోణి శృంగార వనము గా కున్నచో
లలితోరు కదళిక లలర నేల
పల్లవాధర మోహవల్లి గా కున్నచో
భ్రమరకశ్రీల చే బ్రబల నేల

తెలిదిమన్మథునిచే విల్లు గా నున్నచో
 జిగిమాఁపుతూపులు చెలఁగ నేల
తే. గీ. కలికి తెలిరేక గాకున్నఁ గళలు గులికి
తారకావృత్యమై చాలఁదనర నేల
భామినీమణి సాత్త్వికఫలమె కాక
యున్న దివ్యనిరుచుల మేలొందనేల. 138

క. అని పనరు వనరుహాక్షుని
గని కరమున నూదిపలికెఘనతరయుక్తింతై
వను లేకను శ్రీరాముఁడు
చను వొప్పఁగ భావమునది సరము దోపన్, 139

కం. వనుగనుగొనుఁనను గనుఁగొను
మనుచునుగోటానకోటు లంగనలుండన్
మునిగెదు రాధను దలఁచుచు
ఘనమోహారసాబ్ధిలోన గమలదళాక్షా. 140

కం. మాయక్కకన్న రాధిక
యే యెక్కువ యైనచావ యొఱిగింపు మదే
యీయిమ సాయము నెన్నఁగఁ
బ్రాయంబున రాజుబంటు వాని దలంపన్. 141

ఆ. వె. వావిగాని వావి వయసునఁ గడుబెద్ద
గుట్టులేదు మిగుల గట్టువాయి
బుద్ధిగాదు మాను పెద్దాపెదండు మిం
కనఘ చేటనంగ వినవె కృష్ణ. 142

ఉ. నా విని యల్కదొల్క యదునాయకుడిట్లనె బోంట్లజాతులన్
భావము మర్మకర్మములఁ బ్రౌఢతనంబును దారతమ్యమున్
గోవిదకోటికే తెలిసికోదగు నంతియె కాని కానలన్
గోవుల మేపుపల్లె రపు గొల్లనికిం దెలియంగ శక్యమే. 143

సీ. తాఁ గన్నకూఁతురై తగునుడిపడఁతిని
 తెనఁగిన నలువ కే ఘనత దఱిగె
దనగురుపత్నియై తనరారుతారను
 గదిసినరాజు కే కొదవవచ్చె
జెలియలివావియై చెలువొందు వృష నెంతో
 తొడరినయినున కేదోస మొదవె
మనుమరాలైన గంగనుగూడి వలసిన
 మున్నీటిరాయఁ డేపన్నె దొరఁగె

తే గీ. వెనుక మఱి దంద్ర మరుకేళి గానసినట్టి
వ్యాసువంతటిముని కేమి వాసితగ్గ
వావి గాదంటి వారెవార వారలెల్ల
నీవు చేర్చిననీతులు నేరకేమొ. 144

తే గీ. హరికిభూకాంత దావావి నత్త గాదొ
అలపురారికి గంగ మేనత్త గాదొ
హరిహయునకహల్యాసతి యత్త గాదొ
వా రెఱుంగరొ నీపాటి వారు కారొ. 145

తే గీ. రాముకంటెను జానకీ రామ పెద్ద
కాంతుకంటెను రేవతీ కాంత పెద్ద
రమణుకంటెను గేలినీ రమణి పెద్ద
పెద్ద దంటి వీవే చిన్నపెద్దవార. 146

తే గీ. రామ గాదది మగనాభి రామ గాని
నారి గా దది మరువింటి నారి గాని
కొమ్మ గాదది సంపంగికొమ్మ గాని
గుమ్మ గా దది ముద్దులగుమ్మ గాని 147

సీ. మగతేటిగుంపుకు మగువముంగురులకు
వేనాటి స్నేహమో యెఱుఁగ రాదు
అలచందమామకుఁ జెలియనెమ్మోమున
కేమి దాంపత్యమో యెఱుఁగరాదు
కపురంపుతావికిఁ గలికికెమ్మోవికి
నేయానుకుల్యమో యెఱుఁగరాదు
బంగారుగిండ్లకుఁ బడఁతిపాలిండ్లకు
నేఋణానుబంధమో యెఱుఁగరాదు

తే గీ. కలుకుమగమీలు చెలివాలు గనుఁడాలు
కాంతిజిగిచూపు మరుచేతి కలువతూపు
వసితమైమించు కళకళ యుపొడిమించు
నొక్కచోటనె పుట్టనిదొకటె కొదవ 148

ఉ. గంబుర మోవి మారుతుఁ గంబుర తియ్యనిపల్కు నీలనా
గంబుర వేణి చందురుస గంబుర ఫాలతలంబు చాయపూ
గంబుర కంఠ మంబుజయుగంబుర కన్నులు దేవమత్తనా
గంబుర చన్నుడ ల్పురవగంబుర గుబ్బచనుల్ దలంపఁగన్. 149

కం. తారలు చక్కనిగోరులు
త్రాంలు రదపఙ్క్తి పంచదారలు పలుకుల్

తారలు చొక్కపు పిక్కలు
తారల జెలి గెలుచుటరుదె తారుణ్యమునన్. 150

ఆ వె. మబ్బుమబ్బునడచు బిబ్బోకవతి వేణి
వింటివింటినడచు వెలదినడుము
కలువగెలువజాలు గలకంటిపైతావి
మించు మించ నెంచు మెలతమేను. 151

తే గీ॥ తొడలె చాలు సురంభల దొడరి గెలువ
నుదురె చాలును శశిరేఖ నెదురుకొనగ
గోడె చాలును దారల దూలుసేయ
జాన మెయిచాలు హేమాతి జయము నెంచ. 152

తే గీ॥ ఇందుబింబాస్య చిరునవ్వు నెంచిచూడ
జంద్రకిరణవిలాసంబు సహజమయ్యె
వింతిను నుగొప్పుకొప్పున కెంచి చూడ
గాఢమేఘంబు సరిపాటి గాదనంగ. 153

చ. చిగురులు పానకంబు సుధ జీవిరసావళి జుంటితేనియల్
పగడము ద్రాక్షలుం జెఱకు పాలును బాలును బంచదారయున్
మగువ మెఱుంగుమోవిగతి మన్మథ దాహధరంబు దీర్చునే
తగుసకలాంగకంబులకుఁ దద్దయు సౌఖ్యము లీయ నేర్చునే. 154

తే గీ॥ తారుమారు ఘణంబులు దీరదేరి॥
తారుమారు గణంబుల పోరుమాలు
మారటంచని మాఱు వేమారునట్టి
నారియారుకయారె వె య్యారుడీడె

చ, గిరులును గిండ్లు గిన్నెలును కృష్ణకచాసుపాళికోటి రా
మలరయొక పేరులేక చను మక్కువ జక్కనపక్కు లక్కడ
గ్రక్కరయిబఁ జూపి జోడడసి కుంది యమందరసానుభావతన్
హారువు దలిర్చకే కువల యాపునకే హితవొందవాయెగా. 156

సీ. కుటిలత్వ మావారి కురులప్రాపునఁ జేరి
జనవరు లెన్నఁగా ఘనత కెక్కఁ
గఠినత్వ మెనలేని కలిగి గుబ్బలనాని
పారెసుఁ గొండంత పేరుజెందె
మందత్వ ములవొంది మగువ నెన్నడ నంది
యనుపమవిఖ్యాతి నతిశయిల్లె

జంచలత్వ మెసంగి చెలికన్నుల నడంగి
కువలయావళుల గోమరు మిగిలె

తే. గీ. కాసఁ గృతకృత్యమై చెలికాను దెసనుదొట్టి
యిల వసంతయశస్స్ఫూర్తి నెనసె ననిన
జెలియు నయ్యుత్తమాంగిని గలిసినట్టి
పురుషుఁ డౌరౌర పురుషోత్తముండు గాఁడె.

ఉ. దాని మెఱుంగుముంగురులు దాని ముఖాబ్జవికాస వైఖరుల్
దాని విశాల నేత్రములు దాని యొయారపుచూపుసంపదల్
దాని యురోజగౌరవము దానిక దానిహొరంగు మేనిడాల్
దాని కళాకలాపములు దాని మృదూక్తులు దాని కేతగున్. 158

ఉ. చక్కఁదనాన కేమి రుచిసంపద కేమి మెఱుంగు కేమి యెం
పెక్కఁడ రాతిబొమ్మయెడ నెంతయు దానఁ బనేమి దానిపై
మక్కువ లెక్కతక్కులను మాటలపిక్కులు సొక్కుఁ ద్రొక్కులే
దిక్కున నైన గాని కలదే కళ దేటగ నెంచి చూడఁగన్ 150

క. అనిపలికి కలికితనమున
తనుదీయక చేరిపోరు నడవింటిదొరన్
గనికినుక దొంగుక నవిరున్
వనజాక్షుడు వానివాని బలమును నెల్లన్

సీ. కలువల చెలికాడ కానీర నీకాక
సుందరీమణిమోము జూచుదాఁక
మలయమారుత యేల మసలెదు నీరాక
సుదతియూర్పులు మేన సోకుదాఁక
మదకీరమా యేల పదరెదు నీవీక
పద్మాక్షి నను జూచి పలుకుదాఁక
నెమలి యెందుకు పట్టి దుముకులు నీకేప
తొయ్యలి నెరికురు ల్దువ్వుదాఁక

తే. గీ. పికమ నీకూఁక చెలిమాటవినెదుదాక
వంచ నీపోక సఖినడల్గాంచుదాక
తేటినీజోక నతిచూపు నాటుదాక
మార నీఢాకనన్నింతి చేరుదాక

తే. గీ. ఇంతలోననె నను మీర లింతచేరి
బారుదీరుక బలుకారు బారు సేయ

నాన దారిదె మీమీద నానరేపె
పొమ్మగట్టెద చక్కెర బొమ్మజేరి

క. అని కింతుఁ గంతుబలములఁ
దనచే నైనంతదూతి తారివిరాళిం
గొను శౌరిముందు దోఁచఁగ
వనితామణి యెన్ని సెజ్జ వ్రాలెవితాకై. 163

మాలిని. ఉసురని తలయూఁచున్ యోజనల్సేసి చూచున్
గసరుచు చెలి నవ్వున్ గప్పుమీసంబు దువ్వున్
విసువుచు విధిదూఱున్ వెట్టికోర్కెల్ల గోరున్
గొసరుచు బయలానున్ గుందిసర్వంబు మానున్ 164

కం. విను వెందుఁ జిటికె మన్నను
గనుగొను గనువెట్టిజేయు గలవర మందున్
గినుక గొను శిరము వంచును
వనితా రమ్మనుచు జేయి వసుధం జేరున్ 165

కం. హరి యిటుల విరుల పాన్పున
విరహాగ్నిని నిగురు కాఁక వెతగొని పొరలం. 166

చ. కనుగవ దమ్ములున్ సిరపు కప్రము మోవిని గల్వఁ దారలన్
గొనబుచివుళ్ళు గేలఁ దెలిగోరుల మొల్లల బంధుజీవపు
న్ననలు పదాబ్జయుగ్మమున నాభిని బొన్నలు మేన మర్వము
న్ననిచి సుగంధముల్గ్రోలిపి తెమ్మెని బూవురటీల వీచుచున్ 167

తే. గీ. సారెకు నొనర్చు శైత్యోపచారవిధుల
శ్రీనివాసుండు మెల్లన వేదదేఱె
ద్యుమణి యంతట బొడసూపె నుదయగిరిని
బూర్వదిక్సతిపాపట బుట్టనంగ 168

శా. శ్రీమద్గోపవధూమనోహరణ పుంజీభూతశృంగారరూ
పామేయాద్భుతసుందరాంగ జితపుష్పాస్త్రాయుతా రుక్మిణీ
భామాద్యష్టమహిష్యపాశ్రిత హరబ్రహ్మమహేంద్రస్తుతా
జీమూతప్రకరోపమానకలిత శ్రీనీలవర్ణాన్వితా 169

కం. అనుపమ లావణ్యాశ్రిత
వనితాకుచమర్దనాదిపాండిత్యకరా
తను తేజఃస్ఫూర్తి జితా
తనుకోటిమహామహాత్మ్యత సహస్రకరా, 170

మాలిని. కంజదళేక్షణ కౌరవశిక్షణ కార్యవిచక్షణ కాంతినిధీ
రంజితభాషణ రాక్షసభీషణ రత్నవిభూషణ రమ్యసుధీ
సంజయకారణ శత్రువిదారణ సాయకధారణ చారునిధీ
ప్రాంజలినారద పాలననీరద భాసురసారదయాజలధీ. 171

తృతీయాశ్వాసము

సంపూర్ణము

శ్రీరస్తు

(ఇళాదేవీయ మనునామాంతరముగల)

# రాధికాసాంత్వనము

**

## చతుర్థాశ్వాసము

శ్రీ గీతాలసమానా
భోగీంద్రశయాన విహగపుంగవయానా
వాగీశనుతాఖ్యానా
యోగీశ్వర చిన్నకృష్ణ యోగనిధానా. 1

తే. గీ. అవధరింపుము దేవ దివ్యానుభావ
వ్యాసమునిసూతి జనకభూవరునిఁ జూచి
చొక్కటపుఁ జీనిచక్కెర యుక్కెరలకు
లెక్కయై మించునుడిచవు లెక్కఁ బలికె 2

వ. అంత ననంతుండు దురంతకంతుసంతాపచింతాభరం బంతరంగంబున మఱుంగుపఱచుకొని కాల్యకరణీయంబు లాచరించి షడ్రససంపన్నంబయిన యన్నం బొక యన్నుఁదలమిన్న వడ్డింప నారగించి గంధోదకంబుచే గండూషించి ప్రక్షాళితపాణిపాదుండై యాచమించి దివ్యాంబరాభరణ గంధమాల్యాదుల ధరించి యత్తమామలకడ కేతెంచి నమస్కరించి వారిచే మన్ననలు గాంచి తేవచ్చి బహుదివంబు

లారుం బోయిరావలయునని మందలించి కదలించిన కౌతుకంబున నిశాదేవిం దో
డ్కొనిరమ్మని తగువారల నియమించి బయలు వెరసి తన్ను వెంబడించి వచ్చు బం
ధుజనంబుల బహూకరించి పంచకనకరథం బారోహించి మించినవేగంబునం జని
చని మునిజనబృందావనంబగు బృందావనంబుఁ జేర నరుగుదెంచి రథంబు డిగ్గి నిజమంది
రంబుఁ బ్రవేశించి యందు నందయశోదలగురించి నమస్కరించినవారును గాఢాలింగ
నంబు లాచరించి దీవించిన మోదంబు వహించి యొక్కసంకేతస్థలంబున కేతెంచి
శ్రీదాము నామధేయుని చేఁ గురంగనయన తెఱంగు మఱుఁగు లేక యాలించి దిటంబు
చాలించి యిందు కేమి సేయువాఁడ ననియూహించి నేఁ బోయినం గాని రానోపదని
నిశ్చయించి యప్పగ లెల్ల నొక్కలాగున వేగించి యర్ధరాత్రంబునం బయలుదేరి తేట
యై జగంబెల్ల నల్లిబిల్లిగా నల్లుకొని జాబిల్లి వెల్లువగా వెల్లివిరిసిన బొండుమల్లియల
నల్ల విల్లునిందు పండువెన్నెలలు గాయు రాధికా సుందరాంగి మందిరాభిముఖుండై
చనుసమయంబున.

సీ. యెవతెబోయెద విందు నాడిపొమ్మని పల్కు
వింతులపైఁ గన్ను లెత్తఁ బెట్టుఁ
బోనీము మముఁ గూడి పొమ్మని యరికట్టు
చిన్నికన్నెలఁ బెడ చేతఁ గొట్టు
నేఁ గూడ వచ్చెద నిలు నిలు మని చేతు
చంచలాక్షుల వదలించి నెట్టు
నామీఁదియాన యిందాఁక రమ్మని పిల్చు
భామినీమణుల నేమేమొ తిట్టు

తే. గీ. విఱిగా నిక నేల పోవద్దు వీడె మరలు
మాను మని లోకు లిటువంటి మాట లాడఁ
దడ వుపశ్రుతు లని చాల తత్తరించు
రాధపై బాళిగొని యదు రాజమౌళి. 4

తే. గీ. ఇటులఁ జనుదెంచు హరిరాక యెఱిఁగి చిలుక
చెప్ప విని రాధ తనయొద్ద చెలులఁ బిలిచి
శౌరి యిట వచ్చెనని వింటి మీర లతని
విడక నిల్పుఁడు పోమాట మిడక యుండ. 5

చ. అనిన మహాప్రసాద మని యాచెలు లందఱు నేవిశాన వై
నవు శకటారిసంగతి గనం గలిగెం గద నేఁటి కంచు నె
మ్మనముల విఱ్ఱవీఁగుచును మాయనిగంధగజంబులట్లు వీఁ
కను జనుదెంచి వాకి లరి కట్టుక నిల్చిరి ధీరచిత్తలై. 6

తే॥ గీ॥ రమణిపై కోరి యంతవిరాళి గొనుచు
నేమిటివి నైనఁ జూడక యేదివినక
నెవ్వి యూహింపకయ వచ్చి యెప్పటట్ల
రాధయిల్ చేరఁ జనవొక్క రామవలెక. 7

సీ॥ ఘనత నష్టము లేక చనియె దప్పేఁడ వీవు
స్వాంత మూపనిగాపుసామిఁ గానె
స్వామి లైతిరి చాలుఁ జా లవ్వలికి బొందు
నీవు పొ మ్మనుదువా నీతిఁదప్పి
నేను గా కవ్వరు నీ కిటఁ బనిరోమి
పని లేక యే నేల వత్తు నిటకు
వాపమ లిఁక నేల నానాఁడె పోయెఁబో
యత్త కల్లునకు నెం తైనఁ బోదె

తే॥ గీ॥ రాత్రిబేరాన నున్నావు రా మురారి
పగలు బేరము లాయెనో పద్మగంధి
యిట్టియత్యుక్తు లెదిట్ట కట్టిచేసె
చెలి మవల నేలుదొరసాని శిక్షగాదె. 8

సీ. చెల్లనిమాటాడి చెల్లించుకొంటివి
నేర్చి నేరక యంటి నోర్చుకొనుము
విడు మింక నీ త్రియ తెల్లిమాటలు నెల్లఁ
దీ నైన విటు లాన త్రియ నేల
పద్మాక్షి విన్న దెప్పర మాను గద లేగు
మేలిక యల్గిన నెవరు దిక్కు
చని యేలి కగునిళాపతి జేర్పుకొని యేలు
మిక రెవ్వ రే నెవ్వ రెంచి చూడ

తే॥ గీ॥ మొదట నెన్నాళ్ళనుండి యీములు చదవము
బోటిపద సేవ చేసిన నాఁటనుండి
కొంటెవగ లేలఁ జెందనో గోపబాల
కొంటె నీకింత యీయనా కోమలాంగి. 9

తే. గీ. అంటుపడి వచ్చినావు మమ్మంట కేగి
శౌరి మాసంభళకులుతత్సఖులకొఁ గఁగు
మంటునదలే దటంచుమిమ్మంటియిపుడు
బాసలెల్లను జేసెద భామరాంగి 10

సీ. కనుదోయి మూయంగ నేమిగనుము నిద్దుర లేమ
రాధపై బాళిచే రాత్రియెల్ల
గోటిచీరు లిడేమి కోరి విభ్రాంతిచే
నారి నారయుఁ బొద్దల్లారఁ జీరెఁ
బలుగాటు లివి యేమి చెలి నెడఁబాసిన
కమలజాపై నాడుంగరుపఁ దవిలె
జడపేటు లివి యేమి సరసిజాక్షిని జేరు
మనిజోటిగొని మీటె మనసిజుండు
తే. గీ. కుటిలకచ నేల కీగంధ మెయిలఁ జిటిలె
మేటివిరహాగ్ని పైకొన బీటలెత్తెఁ
బసిఁడిదుప్పటిఁ బస నేమి పద్మనాథ
వినవె పచ్చనివలువ నా డనుట నన్ను.
సీ. పామును బట్టెదఁ బా మేమి చేయుఁ బొ
మ్మహిగర్వదమనుండ వైననిన్నుఁ
జిచ్చులోపల జొత్తుఁ జి చ్చేమి చేయుఁ బొ
మ్మతిదవానలభోక్త వైననిను
సురల దాఁకెద సురల్ నెరవుసు రేఁపు పొ
మ్మా త్రివిక్రమమూర్తి వైననిన్ను
సేనానఁ బెట్టెద నా నేమి సేయుఁ బొ
మ్మాదిసర్వజ్ఞుఁడ వైన నిన్ను
తే. గీ. సత్యములు పొత్తుగుడుచు గా సన్నుతాంగి
ధళిర సత్యము లాసలై వచ్చునీకు
నైన రాధపదాబ్జంబు లంటివత్తు
నంటుకొను మిళ పాదంబు లచటి కేగి. 11

తే. గీ. అను సఖీమణి వాక్యమ్ము లాలకించి
బలిమి కలుముల జాలుములు బలియు జోరవ
చేసి చూచెద ననుచు నా శ్రీధరుండు
శిబి చెంగంగలోఁ జొచ్చి పోవఁగాంచి.
సీ. ఓనీరదాలక యోచంద్రబింబాస్య
యోమీనలోచన యోసువాక
యోచంద్రికాహాస యోమధురాధర
యోమంజులాలాప యోకుందదంత

యోకంబుకంధర యోపీనవక్షోజ
యోవారిరుహపాణి యోకృశమధ్య
యోయూరుజితరంభ యోతూణవిధజంఘ
యోపల్లవసమాంఘ్రి యోగజయాన

తే॥ గీ॥ గచ్చులిడి కన్నుమొచ్చుకు చొచ్చివచ్చి
రెండు రెండని శౌరిపై రేమలెల్ల
మొనసి పైటలు బిగఁగట్టి ముందు కొక్క
మరునిమూలబలంబనా నురవడించి. 14

సీ. విడు విడు మని డాసి కడకన్ను లెఱ్ఱఁజేసి
జలికమ్మతమ్ముల విసరె నొకతె
తను వొకింపుక పొంచి తమియుప్పతిల వంచి
సంపంగివనల చే జవిరె నొకతె
ఝుమ్మటంచు నదల్చి జాజీకడ్డము నిల్చి
విరజాజివిరు లెత్తి విసరె నొకతె
గగ్గోలుగా నార్చి కడుదురంబు దనర్చి
జిగినల్లుగలువలఁ జదిమె నొకతె

తే. గీ. చలువపన్నీరు పైనిండఁ జల్లె నొకతె
యొప్పుపుప్పొడి చెప్పున గుప్పె నొకతె
యొరగకాయని రాసీక యొద్దుచూపి
యామఁ డనిరాధ పైదళం బనుప జెలఁగి.

చ. చెలి చెలులిట్లు చేరి తనుఁ జెందినయుల్లము లుల్లసిల్లగా
బలు చనుగుబ్బపోటులను వాల్జడవేటుల గోటిపోటులన్
గలిబిలిచేసి రవ్వలిడఁ గాఁ గని శ్రీహరి యాటపోటులం
గలఁగని గంధసింధుర మనంగ దొలంకగనిల్చి యిట్లనున్. 16

తే. గీ. సుదతి యెనుమంత కడగంట జూచినంత యింతవంతులు చేతురా యింతులార
అలుకదీరగ దొరసాని కమరబలికి చెలిమియొనరించి సుకృతంబు జెందుడనిన.

సీ. చెలిమియొనర్పఁగా వలదె యీనిన్నంచు కసమసల్కు కెమ్మోవి విఱిచె నొకతె
యీబుద్ధి యీనాఁడె యెందుబోయెటంచు విడనాడి చేతులు విచ్చె నొకతె
యెవ్వారి సెంచక యిక నొంగుదువంచు గలికిలేనదుముల్కు గులికె నొకతె
మమ్మేలఁ గేనేడైన మాటలాడితివంచు వాలుగన్నుల దేల వైచె నొకతె

తే. గీ. పెట్టికొక కాల ముదవిన సేవకునకు గబుగునొక కాలమంచును గరలు మాల
రాలగమ్మలు చెక్కులఁ దూలియాడ మాచ కాచక మట్టితల యూచె నొకతె.

కం. వనితలిటు లగడు పలు పగగని యిప్పుడు వీరి కావ గార్యము గనఁబో
మని తెలిసి రాధవినగాఁ దనరఁగ హరిపలికె దలఁపు వల్లె ఙ్ఞ్వాన్ 19

కం. రమ్మా మరువపు రెమ్మా కుమ్మా జాలలేని సొమ్ము గొజ్జగి తెమ్మా
కమ్మనుకొన్న సంపఁగి కొమ్మా దయచేసి మనవి కొమ్మా కొమ్మా. 20

చ. నిలువరమంతగాఁ గలిగె నేని ననుం బిలుపించి నీదు హ
స్తలుకుమిటారి గుబ్బచను గుట్టలఁ గ్రుమ్మి యదల్చి పల్కఁ జే
నలవడఁ జెక్కు గొట్టి యిక టా జడ కొద్దని మాట కిప్పుడీ
చెలియల కొప్పగించి యిటు సేయఁగఁ జెల్లునె రాధికామణీ. 21

మ. అదుగో మారుఁడు పొంచెనే చెఱకు విల్లాలాయ మైవంచనే
యెదపైఁ దూపులు నించెనే యళిబలం బెంతో విజృంభించెనే
మదకీరార్భటి మించెనే పవనుఁడు సామర్థ్యంబు రెట్టించెనే
సుదతీ నిన్నిటు వంచనే సలుపు మం చుంధాత నిర్మించెనే. 22

చ. చెలి నిను బాసి నెవ్వఁగలిఁ జెందుచు నిద్దుర మాని ధైర్యముం
దెలిపెడివారు లేక పరదేశివలెం బవళించి యుంటిగా
నలుగురి యాడికల్ వినుచు నావిధి నిట్లుతపింప నీదు పె
ద్దఱిక సుకృతానికైన వని తాదఱు సేయఁగ రాదె నాపయిన్. 23

చ. హరిహరి రామరామ యిటు లారడి సేతురె సక్కార హా
కరఁగినదోసపం డినుప కట్టుకు వాలునె చాలుచాలు నా
సరి సరజాణ లాగడఁగ సల్పఁగ మారునిపోఁ దారి నీ
చిరదయ నేలవే తనుఁ జేరితినే నిపు డంగనామణీ. 24

చ. నను గరుణించవే పలుక నంపవె కౌఁగిటఁ గారవించవే
ఘనత ఘటించవే చెలిమి గాంచవె నాపలు కాదరించవే
నెనరు గణించవే ముదము నించవె యెంచవె యేల నాపయిం
గినుక వదంపవే తెలియకే నిను వేడెద రాధికామణీ. 25

ఉ. చక్కని దానవంచు రతిసార మెఱింగిన దానవంచు నా
యక్కఱ దీర్తువంచు నను హాయిగఁ గౌఁగిటఁ జేర్తువంచు నే
నిక్కము నమ్మివచ్చెనెడ నీవిపు డీమటుమాయలాంగ్రచే
నక్కట యొప్పగించి యిటు లారడి చేతురె రాధికామణీ. 26

కం. అని యా వాహనము విస
ర్జనమును లేకున్న జూచి శౌరి సుఖంబే
పెనఁబెట్టిన దీపని యని
యనిరొంచ జెలి చిలుక నంచి యమృతము లొలుకన్. 27

కం. చిలుకా నీకును నాపై
వలు కాపలు కాదరించియమృతము లొలుకం
బలుకుచు ముద్దులు చిలుకుచు
గులుకుచు నిటురమ్ము ప్రేమగొనకొని నాపై.

చ. అన విని చిల్క యుబ్బిపడి యాహరిచేరగ నూరుకుంటుటల్
దనకును మేరగాదనుచు దగ్గయి రాధకు దెల్పి ఘల్లుఘ
ల్లని నునుమువ్వలందియలు వంగ్రములు మ్రోయగ రెక్కలార్చుచుం
గొనబుజవాది వాసనలు గుప్పున వీవగ వచ్చియచ్చటన్ 29

సీ. వెరిపెంపు రేకలవాని నిగలొందుతొగవిందు
వగజెందు ముద్దునెమ్మొగమువాని
సొగసుచూపులవాని మగరాల జిగిరాల
దగురాల మొసఁగుదంతములవాని
నిడుదచేతులవాని నొడికంబునిడికంబు
నుడికంబు గొనుకంఠ మొనగువాని
కలికిపేరెదవాని వలమబ్బు బలుపుబ్బు
వెలిదొబ్బువలపుమై సొలపువాని

తే. గీ. శ్రీకరాంగదకౌస్తుభ శిఖిశిఖండ
మంజుమంజీర కర్ణికా మణికిరీట
కనకపటహారచారు చక్యమలవానిఁ
గృష్ణదేవుని గనినవ్వి కీరమనియె 30

కం. గోపాలసామిగారా
కాపురమే పురము చాల కాలమునకు హా
మీపాదయుగము గంటిమి
చాపల్యము పేరె నున్న కాంతము దీరెన్

కం. అని పలుకు చిలుక నటు పో
గని కరమునఁ జేరఁదీసి కవికర మొప్పం
గవికరము దువ్వి ముద్దిడి
చనవునహరి పలికెగండచక్కెరలొలుకన్ 32

కం. శుకవాగమృతాబ్ధిందుని
శుకవాహనజనకు నన్నుఁ జాలకనసేయున్
శుకమా తగదూరకమా
శుకవాణికిఁ దెలుపు శరణఁజూడుమ యంచున్ 33

వ. అనిన విని శుకంబిట్లనియె. 34

సీ. ననుఁ గాదు పొమ్మని రాత్రిఁ జేరని వాని
నే నెట్లు పిలుతు నో నెలతలార
నా పేరు నావగ సాక్షికిచ్చిన వాని
మో మెట్లు చూతు నో ముదితలార
బాస లెన్నో చేసి పద్దుదప్పినవాని
పలు కెట్లు విందు నో పణఁతులార
పరివారిలో నన్నుఁ జౌక చేసినవాని
చెలి మెట్లు చేతు నో చెలియలార

తే. గీ. యనుచు నిన్నించు చెలులపై నట్టెనెయ్య
మోయమండెడు నగ్నిరూకో యనంగఁ
బ్రజ్వరిలి వేటుపడుపాము పగిదిఁ జీరు
తరుణి నేదారి విను గూర్తు దానవారి

తే. గీ. తెలియఁగాఁ జెప్పుమనియెదు తెలిసి తెలిసి
యందు క్షేమాయె నేనందు కనఁగ లేదు
తెలిపి మునుపలె నీకఁగూర్చ నలవియగునె
తారి లేఅని నారి నే దారి నైన.

చ. అనుచు నిరాశగాఁ బలుకు నాచిలుకంగని దువ్వి యిచ్చ మే
లొనరగ ముద్దుపెట్టి వినుమో శుకవంశపయోధిచంద్రమా
కనుగొన నేరిచే ఘటనగాదిది నీకగు నెట్టులైన నీ
పని యొనగూడగా చెలియుబల్కుము నాగతులన్ని కల్కితోన్.

సీ. పడతి యల్లుని గొంచె పఱచుట యుత్తకు
న్యాయంబు దప్పిన నడతయనుము
వనిత! నన్నింతటివానిగా బెంచిన
నీ పెఱుంగవె నాదు భావమనుము
నెలత! నా నేరంబు నీవె యోర్చకయున్న
నికనోర్చ యేలువారెవ్వరనుము
చెలి! నీకు నామీద నలుకదోచిన చెల్ల
పరగ నేఁ జేసిన పాపమనుము

తే.గీ. తరుణి మున్ను నీ సుధరామృతంబు నానుబలిమిని న్నాళ్ళు ప్రాణముల్ నిలిచెనదుము
ఈవిధ ననుఖంటి మగవాని వదలనీవు నెవరున గడించుకొన నేరవనుము చిలుక.

చ. ఎలమిని మత్తమాజాని పహించుక ముందుకు దేవ యాత్మయే
కలుగును బుత్త్రుడై యటులఁ గావున నాతడె నేను నీకు నె
ట్టు లయినను న్ననున్మనుపుటొప్పును నామత నెట్లు దెల్పవో
నెలఁతకుఁ బాపపుణ్యములు నీచెయి నున్నవి రాజరమా.

కం. బలుపక్షపాత ముతుగుము ఫలభంగము లిడఁగఁబోకు ప్రాణము గావన్
గలవేళ దెల్పినా నోచిలుకా దయచేసి చూపు చిలుకకొలికిన్ 40

చ. అనవిని చిల్కనావలన నారడిమాటలు పుట్టఁబోవునే
వనితకు దేటగా దెలియ బల్కెడ దైవము తోడుగావలెన్
వనజదళాక్షన న్నెఱుఁగ వా యని లోపలి కేగి కల్కితోఁ
దన కగుకొన్ని కార్యములు తానయి యేకత జెప్పి యుండఁగన్
విన వినతాంగిఁ జూచి యనె వేమరు మఱుఘోటి నవ్వుచున్ 41

ఉ. వాసవనీలనీలకచ భారము మున్గదియించి యేను నీ
దాసుడనంచు జేరి మురదానవవైరిని బిల్వగావలెన్
బోసరిపొమ్మ పొమ్మనిన బోనను చున్ పెడబట్టి నూకగా
నాసనుజాలు పట్టుకొని నట్టుల బోక పెనంగి యాడెడిన్. 42

కం. అనవిని వనిత గిరుక్కన ఘనమణితాటంకరుచులు గనపటు మోమై
విన నట్లుండిన మరలంజని శౌరినిజేరి మిగుల సంభ్రమ మొందన్ 43

చ. ఇదె సమయంబు రమ్మనిన వింతుల నెంతొ తొలంగ ద్రోయుచుం
బదిల మెసంగ లోనఁ జని పావలసద్దులు గండపెండెపున్
గొదల నడంచుకొంచు మదిలో భయసంభ్రమముల్ చెలంగఁగా
మదనుని గన్న మన్నదొర మానముతోడుత బోవ ముందటన్

సీ. నునుపచ్చరాకట్టు పనిగీముల గడంగి
రవ మేది యుండు ఐరావతముల
మగరాల దగుగూళ్ళ మరగి తిలల్ వంచి
పలుకులాడక కూర్కు చిలుకగముల
జిలుఁగు కెంపుల యంత్రముల మేఁత లంటక
చాల సోలుచుఁ దూలు శారికలను
బటికంపు జగతుల నటనముల్ చాలించి
సారె వేసారు మయూరములను

తే. గీ. బాలశశిరేఖను ముకుంగు పద్మినులను
వల్లకీవేణుమురజాది వాదనముల
జోలిమాలిన చెలియల జూచి చూచి
తెలివిలోపము వానిచే దెలిసికొనుచు 45

ఉ. ఏమని పల్కెనో చెలియ యేవహించునొ యెట్లు లెంచునో
యేమని పల్కఁగావలెనొ యేనవుడే మరి నేమివచ్చునో
కాముడు తోడు గావలయు గల్కికి మాటను జెప్పలేక నున్
బ్రేమను గూడ గల్గునో యటే యని పెన్మది జింతనేయుచున్. 46

ఉ. గోపవతంసు డీపగిదిఁ గొంకి తొలంగుచు బోయి రాధికా
గోపికగృహంబు జేరఁబెడ గుండియ ధగ్గర మెల్లమెల్లఁగా
లోపలికేగి యచ్చట సరోజరిపూపలవేదికయందు పైఁ
గోపము గొన్న యాకుసుమకోమలి నింగని మేనుఝల్లనన్ 47

చ. పదములదండమండి ధరణిం ధృతిభక్తి లెసంగగ జుట్టికొందొగల్
పొదలెడువేడ్కఁ జెలువఁబుట్టఁగ వీడఁగ దాన జానకున్
మదిని దురాపకోపశిఖి మట్టుకమీఱ మురారి ధీరుఁడై
మృదుమధురోక్తులన్ బలికె మీనవిలోచన నెన్ని తిన్నగన్

చ. జలకములాడవేమి నును చల్వలుగట్ట వదేమి హాయునం
దిలకము దిద్ద వేమి జిగిదేరెడుసొమ్ములు పెట్టవేమి పైఁ
గలప మలంద వేమి నగఁగా విరిజాజులు పూన వేమి నా
వలనను దప్పు లేమి మగువా వివరింపు మెఱుంగ వేఁడెదన్

సీ. అలసూర్యబింబమై యలరు నీనెమ్మోగం
బలసూర్యబింబమై యలర నేల
మారుశరంబులై మీఱు నీచూపులు
మారుశరంబులై మీఱ నేల
ప్రబలదుర్గంబులై ప్రబలు నీగుబ్బలు
పరిబలదుర్గంబులై పరిబల నేల
యరిదిబంగారమై యమరు నీమేజిగి
యరిదిబంగారమై యమర నేల
తే. గీ. చూడఁ గూడని నీరూపు చూడకనఁగ
నేటికేటికి నెరయంగ నెరుకపడఁగ
నింతయలుకకు గారణంబిది యటంచు
మందలింపుము నాయాన మందయాన

సీ. మనకెన్నఁడును రాని మౌన మిప్పుడు పూని
మాటాడ వేటికే మధురవాణి
నీకు నాకును గాని నేరంబు మది నాని
మనసీయ వేటికే మధుపవేణి
యరమరికలు పూని యానేస్తములు మాని
మొగమెత్తి చూపవే చిగురుబోణి
నిన్ను నమ్మినవాని నన్నెక్కుడను లేని
యాగడేల చేసెదే యబ్జపాణి
తే. గీ. మారు డదె శానితన మూని పోరెబోని
నీదుపుణ్యానఁ గాని నే నోర్వనేని

గాని మరిదాని కేమి నీ పైనగాని
కరుణజూడఁగ రాదె యో మదనితూణి. 51

కం. పెంచినదానవు దానిఁ గ
దించినదానవులు నీవె తెగిపమ్మటకుం
ఒంచినదానవు నీవే
మంచిది మఱినీవె యలుఁగ మర్యాదటవే. 52

ఉ. నేరము లున్న నోర్చినను నిబ్బరపుం జనుదోయి చేర్చిబల్
తూరిమి మోవినొక్కుచును గిల్కుచు పైకొని పేర్కుఁ బావురా
దారిఁగ బల్కుచుం జెలుఁతఁ దాకుల నూకుల పైసరంబులన్
సారెకుగూడి నామనను చల్లఁగఁ జేయవె మున్నుకోమలీ. 53

సీ. సకియ నీకైజెడ సరి వచ్చె ననిగదా
మించి కాళియుని మర్ధించుటెల్ల
వింతి నీబొమ్మల కెనవచ్చెననికదా
విడక కంసునివిల్లు విరుచుటెల్ల
చెలువ నీచనులకు సరివచ్చె ననిగదా
గిరివరంబును బెల్లగించుటెల్ల
సతి నీనితంబంబు జతవచ్చెననికదా
మున్ను బండినిగూల దన్నుటెల్ల

తే. గీ. వనిత నీయానమున కెన యనుచు గాదె
కువలయాపీడనమును బట్టి కొట్టుటెల్ల
నట్టిననున్యాయమా యిట్టి రట్టు యు
వరయువదిలోన నీవైన హంసయాన. 55

చ. చెలిమిని జిన్నవాఁడె నను జేయుగ దీసి విరాళి గొల్పి నీ
పలచని మోవిచక్కెరల పానక మానఁగ నిచ్చి నిండుకౌఁ
గిలి విడి చొక్కఁ జేసి మరు కేళుల రాపొనరించి యిట్టు లీ
వల దన్న బోవుదువె వాదుకు దీయక రాధికామణీ. 56

సీ. మన కిద్దరికి మున్ను మరుఁగుగా నడిచిన
మరుని ముచ్చట అన్ని మఱచినావె

చ. పొలఁతిరో నీవు సంపనటు పోవుటమాత్రము కాని దానిపైఁ
జెలిమి యొనర్ప లే దనుచు జెల్వగు కీల్జడ చిల్వబట్టి తే
లలర నితంబభూమితలమంటి ముఖద్విజరాజు ముట్టి నా
నిలుకడ చెల్లఁ జెల్లమిగ నీజడధరాకృత మూని తెల్పదన్. 61

కం. ఇంతిపురాకోణములమేల్
బంతి సేమంతివిరియు వారపుబంతీ
కంతుని పట్టపుదంతీ
పంతమె నాతోడ నీకు వలపులదొంతీ. 62

కం. అనియెంత వేఁడుకొన్నను
జన వియ్యని చెలినిజూచి సారసనాభుం
డనియె మది దిటము దప్పక
వినయము ననుకినుక వలపు పెనఁగొని తొలఁకన్. 63

ఉ. మారుడు చూడ నావరకు మాయకు బావమఱంది రాజు నా
పేరిటివాడు మాధవుడు పేర్మిని బ్రాణపదంబు గాలి వన్
వీరికఁ కేమి చేయుదురొ వేమఱుజూచెద నీకుతోస మ
వ్వారిగ వారె బాము లిడి ప్రాణముదీసిన నిచ్చెదం జెలీ. 64

చ. వెలఁదిరో నిన్ను నమ్మదు నా నీకుకురుల్ కుటిలమ్ము రాయి జాఁ
పులు చపలమ్ములాయెఁ గనుబొమ్మలు వక్రములాయెఁ గబ్బిగు
బ్బలు కఠినమ్ములాయె మతిభావము కర్కశమాయె నాపయిం
గలుగుటయెట్లు నీకుదయ కన్గొనవే మది నంగనామణీ. 65

కం. చిగురువిలుకాని శరములు
తగ నెన్నవ దూరి నేను దల్లడపడ గాఁ
సొగసారి యింత రోరుక
నగినం దగుపాటిగాక నాళీకముఖీ.

సీ. తలచి పొయుట పగవారికైనను గాదు
మును పుగా నన్నది మనమె కాదొ
కడఁ బాసి బ్రతికిన కాంతలఁ గాంతుల
నటు మెచ్చునిది మన మాట కాదొ
మనకూటమికి నాడు కొనెడు వాగులకన్ను
బొడిచిన రీతిని నడువలేదొ
యుదయాస్తమయముః మదిలోన దలపక
గడియకు పలుమారు కలియలేదొ

కం. మును నిన్ను గోరి చేరిన దనుజాంగనయుక్కు పోయె ధర నని తెలియన్
విని కని వలచితి ననుచో నిను దూఱగ నేల నన్ను నే ననక హరీ 83

సీ. మును మున్ను కొన్నాళ్లు మన మున్నయట్టి సౌఖ్యంబు బదిలిప్పి చెప్పగా నలవి గాదు
తవిలి కొన్నిదినంబు లవల నఖేదమై మెలఁగితి హద్దు లేని మేల్మి యొసగ
నంతట నీవు నే నను కొన్ని వాసరమ్ము లనుచితి మిద్దఱ మగుచు కలసి
యిప్పుడు ముగుర మై యీ నలుగురిలోన దినము కాపురము మూఁడు విధములాయె

తే|| గీ|| నేమిటి సుఖంబు లిక మీద నేట్రికుకు లేటి వఱదల బోయె నీ మాటలెల్ల
నూర కిటు రవ్వ లిడి సరి వారి నవ్వ వసుధపై దారి నేనుండ వలెనె శౌరి-

సీ. ఎన లేని ప్రేమ నీ వెపుడు వత్తువొ యంచు దలవాకి లెల్లుగా నిలిచియుంటి
రమణ నవ్వుచు నీవు రా జూచు నే యంచు బడతుల శకునంబు లడుగుచుంటి
ములు స్రోక నీవు రావలె జేసి నన్నంచు గులదేవతల నెల్ల గోరుకొంటి
నేరీతి నైన నీ వీటు గాక పోవంచు నిలువని ప్రాణముల్ నిలుపుకొంటి

తే. గీ. వరుని శశివంటి పొల్పడి యెఱుఁగ గంటి నిపుడు నినుగంటి నీమాట లెల్లవింటి
విడుము మిఁక దొంగపోకలు నడుపవంటి దంటయిక యింటికే పొమ్ము తమ్మికంటి.

సీ. నీదు ముద్దుల గుమ్మ నీ మోవి నొక్కితే కటకటా నామది కంప నేల
నీ ప్రాణ నాయిక నీ చెక్కు గీటితే కనలి నాహృది చురుక్కనగ నేల
నీ ముచ్చటల బొమ్మ నిన్నంచ కాచితే పొగిలి నా మది చిన్నవోవ నేల
నీదు పట్టపుదేవి నిను చాల మెచ్చితే యుడుకగ నామేను బడల నేల

తే. గీ. నీదు దొరసాని చనుల చే నీయురంబు నొగుల గ్రుమ్మిన నామది నొవ్వనేల
దాని సొమ్ముల కిట్టు తెఁ దలచి మూడ వలపు పగ వారికైనను వలదు కృష్ణ. 86

తే. గీ. ముద్దుజతగూడి కంటనే నిన్ను వీడి ప్రాణములు చేర నిన్నాళ్లు పట్టెనౌర
మరల నిను బొందిపోయిన మగువ లెందఱి జాలిఁబడజాల నందగోపాలబాల. 87

కం. ఈ నాటి వరకు గానని యీ నాయత మెల్లఁ గంటి నీ నా నిను దా
నీనం గాచితి నిలికే యీ నాయెను నింక నాస లేల మురారీ. 88

సీ. కావేటి కాల్వలై కడు బాలునీరు వారక తుడిచెడు వారు లేక
విరహాగ్ని శిఖల చే వేగుచు బొరలాడి నూరడిల్లుమ యను వారు లేక

దిగులుచే నింత తెగువ నీ కేయువో వలదనిపలికెదు వారలేక
మరుకోల లెద నాటి నెరకొట్టు కాడఁగా భయపడవద్దను వారలేక

తే. గీ. కలఁగి మోహాబ్ధిలో మున్గి గాలిసోఁక
గట్టుగానక యుంటివే గానిపడెడి
నాటికేలేని మతినీవు నేఁటికేల
చాల తడవాయె లెమ్ము గోపాలరాజు. 89

కం. మానమె ధనము గేహము
మానమె సర్వంబు చూడ మానవతులకున్
మానము పోయిన వెనుకం
బ్రాణముతో నుండ వలెనె పద్మదళాక్షా. 90

తే. గీ అన్న యిటు లాడఁగాంచి ము రాసురారి
రమణి దాసరితప్పు దండమునదీరు
దీరుమానమటంచని తెలివపాద
పద్మముల వ్రాలి నళి తమ్మి వ్రాలినటుల. 91

కం. కరమంజీరము ఘల్లన
వనజరుద్రాదివిబుధ వరసేవ్యంబై
తనరిన హరిశిరమప్పో
వనజేక్షణ ద్రోచె వామపాదము చేతన్. 92

కం. లేచి యుదూత్తముఁ డనుఁ జేఁజాచియు నాజన్మమిపుడు సఫలంబాయెన్
నీచిన్నిపదము నొచ్చెనో నాచిరకఠినంబు దాఁకి నాళీకముఖీ. 93

చ॥ నెలఁతరో యాలకించు తొడనిగ్గు తళుక్కున జీర మీఱఁ గాఁ
గులుకు మెఱుంగు గబ్బి చనుగుబ్బలు పొంగఁ బసిండి యందియల్
ఘలుఘలు ఘల్లనం జరణకంజములన్ గొని తన్నినంత పై
ఝలుఝులుఝల్లనం బులకజాలము లెత్తెన దేమి తెల్పెదున్. 94

సీ॥ చేతుల మెఱపుల చెన్నులెంతైనను
దొడలఁ జెందిన నిగ్గు నడుము పేరు
గబ్బిగుబ్బల పెంపు కలుము లెంతైనను
బిఱుదుల నెరిమిన పెంపు మేలు
తను బొమ పైఁదగు ఘనపాల పెంతైనఁ
నును బొత్తికడుపు కందువలు మేలు
పలికెడు పెనవులఁ గలయొయ్యు పెంతైనఁ
బలుకనియలచోటి పొలుపు మేలు

విలుగొన్న దున్నె దొరంగన్న మిన్నదూయున్నల తనమిన్న నొంటికళలంటి సొక్కించి విశాలించి చివచిగలజవజిఘ్నటజిప్పుక్కునం బైకక్కునిక్కి చక్కరమోవి నక్కి జంబుగాఁ జొక్కి లేదుపడఁ జాఱుక్కునఁ నొక్కి మక్కువ నొక్కునం జెక్కిలిగొట్టి మదదంతిపై మఁతుకక్కు మూవంతు టెక్కున సొక్కుదక్కి గిలుకలచప్పరకోళ్ల మం చపుమాళ్వాళ్లును జాలిపక్కి బెక్కుదూది. మెత్త లోనత్తమిల్లుకోచు బుట్టలకూతలును మురతళ్ళిమంబుల నెవలగమగమవలచు గోరజవాచవోరిది నెత్తావులు ఘుమ్మఘుమ్మగం గ్రమ్మ బిసబిసవిసరెడి హొంసపరిమురటిపిట్టల రెక్కచప్పుడులును టకదాయిలమోతలును సారసకోకిలముల కివకివలను శుక్కిత్రిప్పుళకోకోక్కు కళాస్త్రముం బ్రిసంగించుకలికి చిలుకల కలకలంబులం బ్రదపినపరవశమ్ములం దప్పిన మరుసామువరువ లెత్తియిచ్చుగో యనం కలయొలుగులును నిచ్చలపుముచ్చటలం బెమ్మపెరుగ మెచ్చులిచ్చు రాయంచల వళావళులును గళరవమ్ములును ఝంజామంజీరఝుళంఝుళధ్వనులును విడకువిడువకురడబ డకు మెడమిడకవిడివడి తొడబడనదుమదుమామనునుడువులను ఘనజఘనసంఘట్టనా చటచటాత్కారంబులు తోరంబులై మీసరంబులగు పైసరంబులెత్తనాబిత్తరితత్తరిలక హత్తుకొని తళుక్కుతళుక్కుమను చిలుక తేజీవజీజరుహాజారంబునం దమిచిలుక నెను రొత్తులిచ్చుచు సాటిలేని మేటిగోటిపోటులం జొన్నిల్లు కొత్త నెత్తురుల మత్తిల్లుబిత్తరపుగు త్తంపుచను గుత్తులెదనొత్తి యిరుగేలు పాచి కంబుధరుగళంబును గౌగలించి మోము మోమునన్ జేర్చి తన్మనోధర సుధారసధారలం గ్రోలి తియ్యని రుచులందేలె నిట్లిరు వురు నొడఁబడ దొడరికుకుకు లదలింపులు భ్రూభంగంబులను చిఱునవ్వు లుద్దవిడిపద్దు లగ్గలిక తాకునూకులు వీకమీఱ బాహాబాహిం గచాకచిం బెనంగుచు జెంగట నెసంగు ధగ్నినిర్మిత చిత్రరత్న మాలికాయంత్ర పాంచాలికాహస్తవిన్యస్త మల్లరంగసముల్ల సితమల్లవల్లభుల కండిజానుదండివిష్టక న్యస్తసువర్ణవర్ణనీయ సుగంధబంధురసుమతాళ వృంతోద్ధూతవాతపరిగ్ధితా గురుధూపధూమస్తోమంబు లెగిరి. నిగనిగమను జిగిమెందులన గప్పుకొని యన్యోన్యావలోకనోత్సాహమోహంబుల నించుక యుపనయింపఁ బున: పరస్పర నిదర్శనోద్యోగవేగంబులం బుట్టునిట్టూర్పుగాడ్పులంగొట్టువడి యొట్టకేలకుం దట్టిగిలినట్టున మెంగంబులు చూచు కొట్టుబడ జొచ్చనిరియుడ బడినజక్కి వపక్కులమక్కువ లందియుంపొందం బొందు చాళితిబంధప్రతిబింబంబుల ముకురబులంగని సంకుచితమంద హాసంబులం నిగవొందుచుఁ బెనంగు సమయంబున. 102

కం. హత్తుకొనియిన్ని విధముల దత్తరపడ నవని పెనఁగి తనివారక యా
బిత్తరి సైకొని హరిపై మత్తేభము మీదనెక్కు మావంతుఁడనన్. 103

సీ. మరుగుడారము లోలె గిరికొన్న జెజికుసుల్లిమ్మిన్నుముద్దోచు చీఁకటులు గాఁగ
జలజలమని రాలు సన్నజాజులు చాలు చీలివా లెదురిక్కి చాలు గాఁగ
జిఱుకమ్మ చెమ్మట ల్మెరిఁదోఁచు ఫాలంబు రేతొలిచిన్నారి రేక గాఁగ
గరఁగిజాఱిన కస్తురికస్తూరితిలకంబు క్రొంబుగాఁ జెలువందు కందు గాఁగ

తే గీ. వలపుచిఱునవ్వు లలితవెన్నెలలు గాఁగ నాళలను బెంచి కావని యందమూని
కృష్ణపక్షపు రీతి నా కృష్ణవేణి కృష్ణదేవునిపైనుండి కేళిసలిపె. 104

సీ. చెండు గోరించిన - దండిగాఁ బైనుండి, సురుచిరసన్నుల బడు - గొంతసేపు
గాలిచక్రము బట్టు - కరణిని దిరుగుచు, వింతగా దిరుగును - గొంతసేపు
పసిడి జంత్రపుబొమ్మ - పగిది నిల్చినగతిన్, గులుకుచు నటియించు - గొంతసేపు
తుదవాడు బొంగరం - బిదివాఁగ గసిదీసి, గంతు లిడంబాడు - గొంతసేపు
గీ. అభినయము పట్టుమని చెప్ప - నమరిగొట్టు, మూదకొనదగ దిట్టు - ముగ్ధమైముద్దువెట్టు
మార్గములఁగొట్టు మెలమెల - మొబ్బ దట్టు, బాల మారిపైన యుంభాగ - కేళివేళ. 105

ఉ. సాగసిజగంధి యీ పగిది - శౌరిని గూడుక కౌఁగిలింపగా
గిలిచికొని ముత్యపుసరులు - కెంపులదండలు ఝల్లుఝల్లనన్
బెరుగుచు రాలె మున్నగుడు - పేర్చిన మల్లియగూపుగుంపు తా
గ్గుచు శిఖివిస్ఫులింగముల - గూడుక గాలినలీల దోపగన్. 106

క. అట్టి యెడనన మదనజనకుం డామదగతిం జూచి యిట్లనియె. 107

సీ. తలఁగరాగ్నులగోరు - తంక లేదని రాధ, యావి నీ వెఱుంగదు - నంబుజాక్షు
చక్కగ కెమ్మోవిని - నొక్క లేదని రాధ, యావి నీ వెఱుంగదు - నమరనంద్య
మిసిమిరొప్పల దమ్ము - రసము లేదని రాధ, యావి నీ వెఱుంగదు - వాదిదేవ
రంగు వెన్ను సరిపైన - దండ లేదని రాధ, యావి నీ వెఱుంగదు - వతనుజనక
గీ. యనుచు నిరువురు గడిదేరి - హావసువిూరి, యాని పరిపోని కెమ్మోవు-లాన జేరి
తమి చెలఁగజేరి యాల కేర-ఖ్యాల దారి, కోరి మరుశౌరి వలసిరి - కొమరువిూరి.

సీ. గమ్య బృందావనా-రామసీమలయందు నతులిత గోవర్ధ-నాద్రియందు
సత్పథోజ్జ్వల సత్త్వ - సౌధాగ్రములయందు దరణిజాసైకతా-స్థలములందు
పారిజాతలతాంత - పర్యంకములయందు, బహుచిత్ర కేళికా - గృహములందు
మారుత చలితవా - నీరకుంజములందు, భీమనదీ తీర - భూములందు
గీ. సరస భాండీర వటతరు-చ్ఛాయలందు, చారుతరచంద్ర చంద్రికా - పూరమందు
దేవదేవుండు రాధికా - దేవిగూడ, గూడి విహరించె మదిలోని - కోర్కెలలర.

గీ. సంపదలుగల్గు రాధికా - సాంత్వనంబు
చదివినను విన్న వ్రాసిన్న - జదువుచున్న
వారి కన్నారి గానల - వారవారి
బాయు దోసగును గోరిక - లధికదయను.

శా. శ్రీలక్ష్మీ ముఖపద్మ షట్పద తనూ-శ్రీక్షిప్త నీరాంబుదా
లీలామానవవిగ్రహా ప్రమదలే - లీహాన శయ్యాస్పదా
కాళిందీతట కేళి కోవిద మహా - కంసాది దుష్టాత్మ దా
కాళీయోరగ రత్న రంజిత పదా - కౌంతేయ స్థైర్యప్రదా !

కం॥ సారసదాధార సదా
చార సదా తనువినూత్న - చారుతరోద్య
న్నాగ జితాకారయుతా
ధీరనుతాదారచరిత - ధిక్కృతదురితా ! 112

మత్త॥ నాగపాలక నాగదారక - నాగపాలక వాహనా !
నాగకేశ్వర నాగహీశ్వర - నాగనశ్వరగాహనా !
యోగచారణ యోగధారణ - యోగకారణ సాహనా !
భోగిశోషణ భోగిసేవణ - భోగిభూషణ మోహనా ! 118

## —: గద్యము :—

ఇది శ్రీ చిన్నికృష్ణ కరుణా కటాక్ష వీక్షణ క్షణ ప్రవర్ధమానానూన శృంగార రస
ప్రధాన సంగీత సాహిత్య భరత శాస్త్రాది విద్యాపారంగత శ్రీమత్తిరుమల
తాతయాచార్య పాదారవింద మిళిందాయమానవమాన చోళసింహాస
నాధ్యక్ష ప్రతాపసింహమహారాజ బహూకృతానేక చామీక
రాంబరాభరణ ముత్యాల గర్భశుక్తిముక్తాయమాన
ముద్దుపళని ప్రణీతంబైన రాధికాసాంత్వనం
బను శృంగారప్రబంధంబునందు సర్వం
బును చతుర్థాశ్వాసము.

సంపూర్ణము.

